**Results of Chandamama—Camlin Colouring Contest No. 14 (Telugu)**

*1st Prize:* D. Anand, Hyderabad-500 020. *2nd Prize:* M. Madav, Kakinada. *3rd Prize* R. Jai Prakash Rao, Orissa. *Consolation Prizes:* M. Suresh Babu, Alangayam; N. S. Meganath, Madanapalle; G. Shyam Sunder, Warangal; V. C. Sekhar, Hyderabad-500 004; P. Laxmana Charya, Boinpalli School.

# ఫ్లాష్ వాడండి, చిరునవ్వులను చిందించండి.

మీరిప్పుడు తాజాదనంతో చిరునవ్వు చిందించేందుకు కారణాలు :

**ఫ్లాష్ చిందించే తాజాదనం :**
ఫ్లాష్‌లోగల నీలపు పదార్థం నోటిలోని దుర్గంధాన్ని, క్షయకారకమైన పురుగులను దూరం చేస్తుంది.

**ఫ్లాష్ వల్ల ఆత్మవిశ్వాసం :**
ఫ్లాష్‌లో మీ దంతాలను, చిగుళ్ళనూ మరియు మీ నోటినంతనూ కాపాడేవన్నీ ఉన్నాయని మీరు తెలుసు కున్నందువల్ల వచ్చేదిది.

**ఫ్లాష్ యొక్క రుచి :**
అమ్మమ్మ...మురిపించజేసే రుచి ..మరి కాసేపు బ్రష్ చేసుకోవాలనిపించజేసే రుచి.




ఫ్లాష్ యొక్క అపూర్వగుణం నోటికంతటికీ రక్షణనిచ్చే తత్వం

## ఫ్లాష్

టూత్ పేస్ట్ తాజాదనం చిందించే నీలపు పదార్థం గలది.



everest/80/FL/294-TL

# కళ్ళు మూసుకో ఏమికావాలో కోరుకో



మీరు పొదుపుచేసితే మీ కోర్కెలు నిజమవుతాయి. సైకిలా! బొమ్మరిల్లా! ఆటవస్తువా! ఏదయినా మీ డబ్బుతో మీరే కొనుక్కోవచ్చును. కెనరా బ్యాంక్ **బాల క్షేమనిధి** మీ కోసమే! అందమయిన **బాల క్షేమనిధి** పెట్టె మీ పైసలు దాచుకోవడానికి బాగుంటుంది. దానికి తాళము కూడ వేసుకోవచ్చును. మీ పెట్టె నిండగానే దగ్గిరగా వున్న కెనరా బ్యాంకులో డబ్బును జమచేసి తిరిగి దానిలో కూడబెట్టవచ్చును. మీ డబ్బు పెరుగుతూ వుంటుంది. ఎందుకంటే మేముకూడ కొంత మొత్తము కలుపుతాము కనుక. త్వరలోనే ఆ మొత్తము మీరు కోరుకొనిన వస్తువు కొనుక్కోటానికి సరిపోతుంది. మీ కోర్కెలు తీరడానికి ఏలాంటి గొప్ప పద్ధతో చూశారా! పొదుపు చేయడానికి యెంతటి అద్భుత మయిన పద్ధతో చూశారా!

మీకు దగ్గిరలోనున్న కెనరా బ్యాంక్ శాఖకి వెళ్ళి వివరములను తెలుసుకోండి.

మా యితర ప్రత్యేక ప్రణాళికలు

**కామధేను, నిరంతర, విద్యానిధి.**

## బాలక్షేమ నిధి




## కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200కు పైగా శాఖలు దేశమంతటా కలవు.

maa CB 4 Tel 80



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''కీర్తికాంక్ష'']కు ఆధారం వసుంధర రచన. చాలామందిని గొప్ప పనులు చేయటానికి ప్రేరేపించేది కీర్తికాంక్ష. మన చుట్టూ ఎందరో కీర్తిమంతులుంటారు. ఒక్కొక్కరు ఒక్కొక్క విద్యలో సిద్ధహస్తులు. కాని వారు ఇంకొకరిని అనుకరించిన వారు కారు! తమకు అందుబాటులో ఉన్న విద్యనే ఉన్నతికి తెచ్చినవారు!

## అమరవాణి

అనాహూతే ప్రవేశశ్చ, వ్యపృష్టే బహుభాషణమ్,
స్వాస్తుతిశ్చ, స్వాత్మవర్ణస్య, ఇత్యేవం మూర్ఖలక్షణమ్.

[పిలుపు లేకుండా పోవటమూ, పలకరింపులేకుండానే తెగ మాట్లాడటమూ, ఆత్మస్తుతి చేసుకోవటమూ మూర్ఖలక్షణాలు.]

సంపుటి 67 అగస్టు '80 సంచిక 2

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00








గాధి మురళి, నర్సాపురం (ఆంధ్ర)

ప్ర: భాషలు ఎలా పుట్టినవి? లిపి లేని భాషలు ఎలా ఏర్పడినవి? లిపి లేని భాషలో ఉత్తరప్రత్యుత్తరాలు ఎలా?

స: భాష అనేది వస్తువులకూ, గుణాలకూ, క్రియలకూ సంకేతాలతో కూడుకున్నది. ఇతర ప్రాణుల లాగా అచ్చగా సహజ ప్రేరణలతో మనిషి పెరగడు. అతని మెదడు చెందిన పరిణామం మూలంగా అతను తన పరిసరాలను మార్చే జ్ఞానాన్ని అనుభవంద్వారా సంపాదించుకున్నాడు. ఈ అనుభవాన్ని ఇతని నుంచి ఇతరులు అనుకరణద్వారా కొంతవరకు నేర్చుకో వచ్చును. కాని అది పూర్తిగా ఇతరులకు అందటానికీ, వారి అనుభవం దానికి జత కావటానికీ సంకేతాలు కావాలి. ఒక మొక్కగాని, దుంపగాని, కాయగాని, జంతువుగాని తినటానికి యోగ్యమైనదని కొందరు మనుషులు అనుభవంద్వారా తెలుసుకుంటే ఆ తినదగిన వాటికి పేర్లు ఉన్నట్టయితే, ఆ పేర్లు ప్రచారమవుతాయి. వాటితో బాటు అవి తినదగినవన్న సంగతి ఎన్నడూ తినని వారికి కూడా ఉపయుక్తమైన జ్ఞానం అవుతుంది.

భాషలు పుట్టినాకనే లిపి పుట్టింది. భాషలాగే లిపి కూడా ఒక కృత్రిమ సంప్రదాయం. "పాము" అని ఒక భాషలో అరిస్తే ఆ భాష తెలిసినవాడికే అపాయమన్న సంగతి తెలుస్తుంది. అలాగే లిపి కూడా అది తెలిసిన వారికే ఉపయోగపడుతుంది. అయితే లిపిని ఏ భాషవారైనా ఉపయోగించవచ్చు.

లిపి వల్ల భాషలు విస్తృతంగా ప్రచారమవుతాయి. ఎన్నడూ ఒకరిని ఒకరు చూసుకొని వారూ, అనేకవేల మైళ్ళదూరంలో ఉన్నవాళ్లూ ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా మిత్రులూ, ఎప్పుడైనా ప్రేమికులూ కావటం సాధ్యమవుతున్నది. ఇంగ్లీషుభాషకు లిపి లేకపోతే, ప్రపంచంలో ఎక్కడెక్కడ జరిగిన విషయాలూ మనం కొద్ది గంటలలో తెలుసుకోగలమా? లిపి లేకపోతే టెలిగ్రాఫ్ లాటిది సాధ్యమా?

అయితే లిపి లేనివారు కూడా సందేశాలు దూరప్రాంతాలకు పంపటం కద్దు. ఆఫ్రికాలో కొన్ని జాతులవారు ఒక చోట జరిగిన సంఘటన గురించి కొన్ని వందల మైళ్ళదూరాన ఉన్న వారికి డప్పుల అంచెల మీద టెలిగ్రాఫ్ కన్న కూడా వేగంగా అందజేయటం జరిగిందట. అలాగే అమెరికన్ ఇండియనులు పొగద్వారా దూరప్రాంతాలకు సందేశాలు పంపుతారట. కాని ఆ డప్పులమోతా, ఆ ధూమ సంకేతాలూ త్వరలోనే గాలిలో కలిసిపోతాయి, లిఖిత సందేశాలలాగా కలకాలం ఉండవు.




# 86

నేరానికి శిక్ష

సింహళ ద్వీపాన్ని ఏలిన జీమూత వాహనుడి కొడుకు కందర్పకేతుడు గొప్ప అందగాడు. ఒకనాడు ఒక వర్తకుడు అతనికి ఒక వింత సంగతి చెప్పాడు. అదేమంటే, ప్రతి చతుర్దశినాడూ, సముద్ర మధ్యంలో, కల్పవృక్షం కింద, ఒక అతిలోక సుందరి ఆభరణ భూషితురాలై ఒక శయ్యమీద కూర్చుని కనిపిస్తుందట.

కందర్పకేతుడుకి ఆసక్తి పుట్టుకొచ్చి వర్తకుడు చెప్పిన వేళకు, అతను చెప్పిన చోటికివెళ్ళి కల్పవృక్షం కింద అద్భుత సౌందర్యవతిని చూశాడు. అతన్ని చూడగానే ఆ సుందరి సముద్రంలోకి దిగిపోయింది.

ఆమె అందానికి కట్టుబడి కందర్పకేతుడు కూడా సముద్రంలోకి దూకి, దాని అడుగుకు చేరుకున్నాడు. ఆ సముద్రం అడుగున, ఒక బంగారు భవనంలో, విద్యాధరస్త్రీల మధ్య ఆ సుందరి ఒక బంగారు శయ్యపై కూర్చుని ఉన్నది.

ఆమె అతన్ని చూసి, అతని వద్దకు ఒక విద్యాధరిని పంపింది. ఆ విద్యాధరి అతనితో ఇలా అన్నది:

"ఈ సుందరి కందర్పకేళి అనే విద్యాధరరాజు కూతురు. ఈమె పేరు రత్నమంజరి. తనను చూసి సమ్మోహితుడై, సముద్రంలో సాహసించి దూకి, ఈ బంగారు భవనానికి వచ్చినవాణ్ణి మాత్రమే పెళ్ళాడతానని ఈమె శపథం చేసింది. అందుచేత ఆమె నిన్ను వివాహమాడటానికి సిద్ధంగా ఉన్నది."

కందర్పకేతుడు సంతోషించి, రత్నమంజరిని గాంధర్వవిధిని పెళ్ళాడాడు.



వారిద్దరూ కొంతకాలం స్వర్గసుఖాలలో ఓలలాడుతూ బంగారు భవనంలో ఉన్నారు.

ఆ భవనంలోని పెద్ద చావడిలో రత్న మంజరి యొక్క బంగారు ప్రతిమ ఒకటి ఉన్నది. "ఆ ప్రతిమను ఎన్నడూ తాక వద్దు. తాకితే సర్వనాశనం అవుతుంది." అని కందర్పకేతుణ్ణి రత్నమంజరి అది వరకే హెచ్చరించి ఉన్నది.

అయినా ఒకనాడు, రత్నమంజరి దగ్గిర లేని సమయంలో, కందర్పకేతుడు ఆ ప్రతిమను తాకాడు. వెంటనే ఆ ప్రతిమ అతన్ని గట్టిగా తన్నింది. ఆ తన్నుతో అతను సింహళద్వీపంలో వచ్చిపడ్డాడు.

మారణహోమం!

శ్రీపర్వతప్రాంతంలో ఉండిన బ్రహ్మ పురంలో ఒక వదంతి వ్యాపించింది. ఏమంటే, కొండశిఖరాన ఘంటాకర్ణుడు అనే రాక్షసుడు చేరాడట!

ఈ వదంతి మూలంగా ప్రజలు కొండ మీదికి వెళ్లి కట్టెపుల్లలు తెచ్చుకోవటానికి భయపడ్డారు.

వాస్తవం ఏమిటంటే, గంటను దొంగి లించి పారిపోతున్న ఒక దొంగను పెద్ద పులి చంపింది. వాడి చేతిలో ఉండిన గంట కొన్ని కోతులకు దొరిగింది. అవి దాన్ని అన్నప్పుడల్లా మోగించసాగాయి. ఆ విధంగా బ్రహ్మపురిలో జనానికి గంట మోత ఏవేళ వినిపించినా వినిపించేది. దాన్ని మోగించేవాడు ఘంటాకర్ణు డనే రాక్షసుడు అనుకుని, చాలామంది ఊరు వదిలిపెట్టి పోసాగారు. ఎందుకంటే, ఆ రాక్షసుడు నరభక్షకుడనీ, మనిషిని తినటం పూర్తిచేసినప్పుడల్లా గంట వాయిస్తూంటాడనీ ఎవడో పుకారు లేవ దీశాడు.

ఘంటాకర్ణుణ్ణి మారణహోమం చేయించినవాడికి వెయ్యి బంగారు దీనారా లిస్తానని రాజు చాటింపు వేయించాడు.

ఆ గంట రహస్యం ఒక నర్తకికి తెలు సును. ఆమె తన ప్రియులను రహస్యంగా

కలుసుకోవటానికి, నిర్జనంగా ఉన్న కొండ మీదికి వెళుతూ ఉండేది. అలాటి సమయంలో ఒకసారి ఆమె గంట వాయిస్తున్న కోతులను చూసింది.

రాజు చేసిన చాటింపువిని ఆమె రాజు వద్దకు వెళ్ళి, తాను రాక్షసుణ్ణి మారణ హోమం చెయ్యగలనని చెప్పింది. తరవాత ఆమె ముగ్గులతో యంత్రాలు వేసి, గణేశప్రార్థనచేసి తాంత్రికక్రియలు జరిపి, ఒక బుట్టనిండా కోతులకు ఇష్టమైన పళ్ళు పెట్టుకుని, కొండ మీదికి వెళ్ళి, ఆ పళ్ళను కోతుల సమీపంలో విసిరింది. కోతులు గంటను వదిలేసి, పళ్ళకోసం పరిగెత్తాయి. ఆమె చల్లగా గంటను సంగ్రహించి, ఊరికి దిగి వచ్చి, రాజుతో, ''ఘంటాకర్ణుణ్ణి మారణ హోమం చేసి, వాడి గంట పట్టుకొచ్చాను. ఇక మీకు ఈ గంట మోత వినిపించదు.'' అన్నది.

మళ్ళీ కొండ మీది నుంచి గంట మోత ఎందుకు వినిపిస్తుందీ? రాజు ఆమెకు వెయ్యి దీనారాలూ ఇచ్చాడు.

### మువ్వల మోజు

ఒక దేశంలో ఉజ్వలకుడు అనే రథం తోలేవాడు ఉండేవాడు. అయితే వాడి రథానికి ఎన్నడూ కిరాయి దొరికేదికాదు. రథం తోలే వృత్తి వాడికి అచ్చిరాలేదు.

''పొట్టగడవని వృత్తినీ, జరుగుబాటు లేని దేశాన్నీ ఎందుకు అంటిపెట్టుకోవాలి? ప్రపంచమంతా మన మాతృభూమే.



జరుగుబాటుకోసం ఏ వృత్తి చేసుకున్నా చేసుకోవచ్చు.'' అనుకుని వాడు మరో దేశానికి బయలుదేరాడు.

దారిలో ఒక అరణ్యప్రాంతంలో వాడికి అడ ఒంటెపిల్ల దొరికింది. దాన్ని దాని తల్లి అక్కడ ఈని, వదిలేసి, తన దారిన తాను వెళ్ళిపోయింది.

వాడు ఆ ఒంటెపిల్లను తీసుకుని ఇంటికి తిరిగివచ్చి, అడవి నుంచి గడ్డి తెచ్చి మేపాడు. అది బాగా బలిసి పెద్దదై చాలా పిల్ల ఒంటెలను పెట్టింది. వాడు వాటిని బాడుగకు ఇచ్చి, పొట్ట పోసుకోసాగాడు.

వాడు అప్పుడప్పుడూ ఏడారి మీదుగా రాజస్థానానికీ, గుజరాతుకూ ప్రయాణాలు చేస్తూ, అప్పుడప్పుడూ చిన్న ఒంటెలను కొని, తన మందలో చేర్చేవాడు.

వాడు అలా కొన్న ఒంటెపిల్లలలో ఒకటి చాలా అందంగా ఉండేది. అందు కని వాడు దాని మెడకు వెండిమువ్వలు కట్టాడు. అది నడిచేటప్పుడు వాటి చప్పుడు చెవులకు ఎంతో ఇంపుగా ఉండేది. ఆ కారణంగా ఆ ఒంటెపిల్లకు గర్వంగా కూడా ఉండేది. మువ్వలు లేని ఇతర ఒంటెలకు మంటగానూ ఉండేది.

ఒకసారి ఒంటెలమంద అడవిలో మెయ్యటానికి పోయినప్పుడు, మువ్వల ఒంటె వెనక దిగబడిపోయింది. ఉత్సాహంగా గెంతుతూ, ఆడుకోవటంలో అది ఈ సంగతి గమనించలేదు.,

ఒక ముసలి ఒంటె దాన్ని చూసి, ''ఒంటిగా వెనకచిక్కిపోయేవు! సింహమూ, ఇతర క్రూరమృగాలూ హాని చేస్తాయి. నీ మువ్వల చప్పుడు వాటిని ఆకర్షిస్తుంది.'' అని హెచ్చరించింది.

అయినా మువ్వల ఒంటె ఆ మాటలు వినిపించుకోలేదు. ఒంటెలమంద కనుచూపుమేర దాటిపోయింది. చీకటిపడింది. మువ్వల ఒంటె, దారి తెలియక అటూ ఇటూ పరిగెత్తసాగింది. దాని మువ్వల చప్పుడు విని ఒక సింహం వచ్చి, దాన్ని పొట్టన పెట్టుకున్నది.






## 4

[ కుండలినీరాజ్య సైన్యాలు, ధనాగారం నింపేటందుకు, పరరాజ్యాల మీదికి దాడి బయలుదేరినై. ఆ సమయంలో తోకచుక్క కనబడింది. తుఫానులో చిక్కి కొన్ని ఓడలు మునిగిపోయినై. కొందరు సైనికులు ఒక ద్వీపం చేరారు. అక్కడ వాళ్ళు క్రూరమృగాల నుంచీ, ఏకాక్షి మాంత్రికుడి నుంచీ తప్పించుకుని పారిపోసాగారు. తరవాత— ]

సేనాని సమరసేనుడూ, సైనికులూ అలా కొంతదూరం పరిగెత్తిపోయి, ఒక కొండ ప్రాంతం చేరారు. భయంకరుడైన ఏకాక్షి మాంత్రికుడి కంఠస్వరం యిప్పుడు వారికి వినిపించటంలేదు. ప్రమాదం తప్పిందని సంతోషించారు. వాళ్ళను వెంబడించిన చతుర్నేత్రుడి వేగులైన నల్లగూబా, నర వానరం కూడా ఎక్కడో కనిపించకుండా పోయినై.

అయితే, యిప్పుడు చేయవలసిందేమిటి? అన్న ప్రశ్న ఎదురైంది. మళ్ళీ ఏదో ఒక ప్రమాదంలో చిక్కుకోకముందే, ఈ మాంత్రికుల దీవి నుంచి తప్పించుకుని బయటపడాలి. కాని, దీవిని వదిలిపోవటం ఎలా? తాము విడిచి వచ్చిన ఓడలు సముద్రంలో ఏ దిక్కున వున్నవి? ఓడలలో వదిలి వచ్చిన సైనికులకు, తాములేని సమయంలో ఎలాంటి ప్రమాదమూ జరిగి



వుండదు కదా? అసలింతకూ తాము దీవిలో ఏ వైపున వున్నట్టు?

దీవిని ఆవరించుకుని వున్న మహారణ్యం మధ్య దిక్కులు తెలుసుకోవడం ఎలా? ఆ ప్రాంతమంతా ఎక్కడ చూసినా కొండలు, ఆకాశాన్ని అంటే మహావృక్షాలు! ఆ వృక్షాలను అల్లుకొనివున్న తీపరపాపర తీగలు! దిక్కులు తెలిస్తే కద, తామెక్కడున్నదీ గ్రహించటం?

ఇలాంటి చిక్కుప్రశ్నలతో సమరసేనుడు సతమతమవుతూండగా, ఆకాశంలో హఠాత్తుగా మబ్బులు విచ్చి, సూర్యుడు కనిపించాడు. సూర్యుని గమనాన్ని బట్టి చూడగా, తామిప్పుడు దీవిలో ఏ దిక్కున వున్నదీ సమరసేనుడికి అర్థమైపోయింది.

"ఈ మంత్రాల దీవికి మనం యిప్పుడు పడమటి దిక్కున వున్నాం. మన ఓడలు అటు తూర్పుతీరంలో వున్నవి. ఇదీ మన పరిస్థితి!" అన్నాడు సమరసేనుడు.

"అయితే, మనం ఏదోవిధంగా తూర్పు తీరం చేరటం మేలు కద!" అన్నాడొక సైనికుడు.

"మేలు మాట సరే. కాని, ఆ తూర్పు తీరం చేరటం అంత తేలిక కాదు. దారిలో ఎన్నెన్ని ప్రమాదాలను ఎదుర్కోవలసి వస్తుందో! పోనీ, ముక్కుకు సూటిగా పోదామా అంటే—దారిలో పెద్ద కొండలు, అడవులు. వీటన్నిటికీ తోడు, భయంకరమైన క్రూరమృగాలు. వాటి బారి నుంచి తప్పించుకో గలిగినప్పుడు గదా, మనం ఆ తూర్పుతీరం చేరుకోగలగటం!" అంటూ నిట్టూర్చాడు సమరసేనుడు.

నాయకుడైన సమరసేనుడే యింత నిరుత్సాహంగా మాట్లాడేసరికి, సైనికులంతా వెలవెలబోయారు. అది గమనించిన సమరసేనుడు వెంటనే, "మీరన్నట్టు, తూర్పుతీరం చేరుకోవడమే మంచిదని నాకూ తోస్తున్నది. అలాగే చేద్దాం. ఇక, కష్టాల మాటా? మన చేతి ఖడ్గం, కుండలినీ దేవి కటాక్షం—ఈ రెండు రక్షలూ

వున్నంతకాలం, మనకు ఎలాంటి కష్టాలు ప్రాప్తించినా, సురక్షితంగా బయట పడగలం. రండి! నా వెంట నడవండి!" అంటూ సైనికులను హెచ్చరించి తానూ ముందు నడిచాడు.

కొద్దిదూరం నడిచి సమరసేనుడు ఠక్కున ఆగిపోయి, "ఉష్, ఆగండి!" అంటూ సైనికులకు సైగ చేశాడు. అతడు అనుమానించినట్టుగానే, ఎదట ఒక భయంకర దృశ్యం కంటబడింది. అది, ఎంతటి ధీరుడికైనా ఒళ్ళు జలదరింప జేసే దృశ్యం!

ఒక పెద్ద కొండచిలువ చెట్టు కొమ్మల నుంచి మెల్లమెల్లగా కిందికి జారుతున్నది. దిగువను రెండు చిరుతపులులు, కొండ చిలువ తమ మీదికి దూకబోతున్న సంగతి గమనించకుండా, ఆదమరిచి నిలబడి వున్నాయి.

సమరసేనుడూ, సైనికులూ చూస్తూండ గానే, కొండచిలువ దభీ మంటూ ఒక చిరుతపులి మీద పడి, నోటితో దాని తల పట్టుకుంటూనే, మెరుపు వేగంతో పులి శరీరాన్ని మోకుతో బిగించినట్టుగా మెలి వేసింది. ఇదిచూసి, రెండవ చిరుతపులి భయపడి దూరంగా పారిపోయింది.

ఒకటి రెండు క్షణాలు గడిచేలోపల పారిపోయిన చిరుతపులి, తన తోటి పులి





కొండచిలువ పట్టు నుంచి బయట పడేందుకు చేస్తున్న పోరాటం చూసి, పెద్దగా ఒకసారి అరిచి, వేగంగా వచ్చి కొండచిలువ మీదికి దూకింది.

సమరసేనుడు, సైనికులతో, "చూశారా, యీ భయంకర పోరాటం! మనం జాగ్రత్తగా వుండి, యిలాంటి చిక్కులపాలవకుండా మసలుకోవాలి," అన్నాడు.

ఆ తరవాత సైనికులందరూ ముందుకు సాగి, మరొక దారి పట్టారు. ఈ దారి నడవటానికి అంత అనుకూలంగా లేదు. కొండల మీది నుంచి దిగువకు ప్రవహిస్తున్న సెలయేళ్ళ నీటితో, ఆ ప్రదేశమంతా బురదనేలగా మారివున్నది. అందులో ఎక్కడ చూసినా రెల్లుదుబ్బులూ, వెదురు పొదలూ. అక్కడ తుంగ మోకాళ్ళ ఎత్తున పెరిగింది. అందులోనుంచి నడిచిపోవాలి. ఇలాంటి దారిలో సైనికులందరూ చుట్టూ పరికించి చూస్తూ, ప్రాణాలు అరచేత పెట్టుకుని, ముందుకు పోవలసి వచ్చింది. ఎప్పటిలాగా సేనాని సమరసేనుడు ముందుండి దారి తీస్తున్నాడు.

ఆ విధంగా కొంత దూరం ప్రయాణించిన తరవాత సమరసేనుడు, సైనికులతో, "ఈ ప్రాంతం అంతా జలమయంగా కనబడుతున్నది. ఇక్కడున్న నీటి మడుగుల దగ్గిరకు, నీటిజంతువులు తరుచుగా వస్తూ వుండాలి. అయినా, మనం అడవిజంతువులకు భయపడినంతగా, నీటి జంతువులకు భయపడనక్కరలేదు," అన్నాడు.

సమరసేనుడు మాట పూర్తిచేసేంతలో, పక్కన వున్న రెల్లుపొదలలో నుంచి ఒక ఖడ్గమృగం యివతలికి వచ్చింది. దాన్ని చూస్తూనే సైనికులు ఎటు పారిపోవటమా అని దిక్కులు చూడసాగారు. సమరసేనుడు వాళ్ళను హెచ్చరించి, "మనం పారిపోయే ప్రయత్నం చేయటం, మరీ ప్రమాద కారణం కావచ్చు. ఎందుకైనా మంచిది, ఒకళ్ళ వెనక ఒకళ్ళు వరుసగా

నిలబడి, కత్తులు సిద్ధంగా వుంచుకోండి." అని సలహా యిచ్చాడు.

ఖడ్గమృగం తల పైకెత్తి, భయంకరంగా ఒకసారి అరిచి, కాలు దువ్వ సాగింది. సైనికులు భయకంపితులయ్యారు. వాళ్ళందరూ యిప్పుడేం చేయటం అన్నట్టు, తమ నాయకుడైన సమరసేనుడి కేసి చూశారు. సమరసేనుడు ఏదో చెప్పబోతున్నంతలో ఖడ్గమృగం వాళ్ళ కేసి దూకుతూ వచ్చింది.

సైనికులకు ముందు నిలబడి వున్న సమరసేనుడు, అదునుచూసి ఖడ్గమృగం వెన్ను మీద తన ఖడ్గంతో బలంగా పొడిచాడు. ఏదైనా మరొక జంతువు అయి వున్నట్టయితే, ఆ దెబ్బకు పడిపోవలసిందే. కాని, ఆ కత్తి దెబ్బ ఖడ్గమృగానికి ఎలాంటి ప్రమాదం కలిగించలేదు. అయితే, సమరసేనుడి కత్తిపోటుకు అది అరణ్యమంతా అదిరేట్టు బొబ్బలుపెట్టి, మళ్ళీ ఒకసారి కాలు దువ్వి, సైనికుల మీదికి ఒక్క ఉరుకు ఉరికింది.

ఇప్పుడు సైనికులు ఎంతమాత్రం భయపడలేదు. తమ నాయకుడు కనబరిచిన ధైర్యం, వాళ్ళ సాహసానికి ఊతం యిచ్చింది. వాళ్ళు, ఖడ్గమృగాన్ని చుట్టుముట్టి, తమ కత్తులతో దాని శరీరం మీద అందినచోటునల్లా బలంగా పొడిచారు.

ఖడ్గమృగం బాగా గాయపడి, అరుస్తూ ఒక పక్కకు పడిపోయి తన్నుకోసాగింది. సమరసేనుడు, సైనికులతో, "ఏదో,



యిప్పటికి గండం గడిచింది. దీని అరుపు విని మరికొన్ని జంతువులు యిక్కడికి రాకముందే, మనం తప్పుకొని పోవటం క్షేమం.'' అని, అక్కడినుంచి బయలు దేరాడు.

కొంచెం దూరం వెళ్ళేసరికి, వారికి ఒక మడుగు కనిపించింది. అది చూడగానే— ఖడ్గమృగంతో పోరాడి అలసిపోయి వున్న సైనికులు, అందులో దిగి దప్పి తీర్చుకుందా మనుకున్నారు. వాళ్ళల్లో ఒకడు, ''ఎంత చక్కగా వున్నదీ, నీరు! ఈ తేట నీటిలో, హాయిగా స్నానం చేస్తే బాగుండునే,'' అన్నాడు.

అది విన్న సమరసేనుడు, ''ఈ దీవి, మంత్రాలదీవి అన్న సంగతి మాత్రం మరిచిపోకండి, జాగ్రత్త!'' అని హెచ్చరించాడు.

బాగా దప్పిగొన్న యిద్దరు సైనికులు ముందు మడుగులో దిగారు. అలా వాళ్ళు మడుగులో దిగిన క్షణంలోనే, ఆ చుట్టు పక్కల నీరంతా కదిలినట్టయింది. హఠాత్తుగా వాళ్ళ మీదికి, నాలుగైదు మొసళ్ళు వచ్చిపడినై. వాళ్ళు భయంతో కేకలుపెట్టారు. ఒడ్డున వున్న సమర సేనుడూ, సైనికులూ బాణాలు ఎక్కుపెట్టి, వాటిపైకి వదిలారు. అయినా, ఆ సైనికు లిద్దరినీ మొసళ్ళు మడుగు మధ్యకు లాక్కుపోయినై.

ఇలా జరగటం అందరినీ కుంగదీసింది. సమరసేనుడూ, మిగిలిన నలుగురు సైని



కులూ దీనవదనాలతో అక్కడినుంచి బయలుదేరారు. కొంతదూరం వెళ్ళేసరికి వాళ్ళకు ఒక సరస్సు కంటబడింది.

''ఇది చాలా పెద్ద సరస్సు లాగా వున్నది. దీనిని దాటడం ఎలా?'' అన్న సందేహం కలిగింది సమరసేనుడికి. అంతలో సరస్సు ఒడ్డున ఎవరో స్నానం చేస్తున్నట్టుగా నీళ్ళు కదలబారటం కనబడింది. మనిషి ఆకారం మాత్రం కనిపించటం లేదు! సరస్సు పైన ఒక చెట్టు కొమ్మ మాత్రం కనబడుతున్నది. ఆ కొమ్మ నుంచి ఒక పొడవాటి టోపీ వేళ్ళాడుతున్నది. ఆ టోపీకి మనిషి కన్నుల వంటి రెండు చిత్రమైన బెజ్జాలున్నవి.

ఈ వింత చూసి సైనికులంతా విస్తుపోయారు. వాళ్ళతోపాటు సమరసేనుడూ ఆశ్చర్యపోవటమే గాని, యిదంతా ఏమిటి అన్న ప్రశ్నకు సమాధానం ఆలోచించలేక పోతున్నాడు. సరస్సులో నీరు యింకా కదలబారుతూనే వున్నది. ఆ కదలికను బట్టి చూస్తే, ఎవరో కంటికి కనబడని వ్యక్తి స్నానం చేస్తున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వున్నది.

సమరసేనుడూ, సైనికులూ ఒక పొద మాటునవుండి, కన్నార్పకుండా యీ వింత చూస్తున్నారు. ''ఒకవేళ వీడు మాంత్రికుడైన, ఆ ఏకాక్షి కాదుకద కొంపదీసి!''



అన్న అనుమానం కలిగింది సమరసేనుడికి.

కొంత ఆలోచించిన మీదట సమరసేనుడికి, వీడు ఏకాక్షి మాంత్రికుడై వుండడన్న నమ్మకం కలిగింది. అయితే, టోపీ మాట? ఇదీ వాడిదై వుండదన్న నిర్ణయానికి వచ్చాడు. మరైతే వీడు మరొక మాంత్రికుడా? అన్న సంశయం కలిగింది సమరసేనుడికి.

అంతలో సరస్సు నుంచి ఏవో మాటలు వినబడసాగినై. ఆ స్నానం చేస్తున్న వ్యక్తి, ఏవో మంత్రాల వంటివి వల్లిస్తున్నట్టున్నాడు. ఆ కంఠంలో ఒక విధమైన కరుకుదనం, గాంభీర్యం కనిపించింది. వీడెవడో

అసాధ్యుడై వుంటాడన్న సంశయం కలిగింది, సమరసేనుడికి.

ఈ అనుమానాలలో మునిగితేలుతూ వున్న సమరసేనుడికీ, సైనికులకూ మరింత భయంకొలిపే, యింకొక దృశ్యం కంటబడింది. సరస్సు ఒడ్డున పొదల చాటు నుంచి, ఒక పాము తల పైకి లేస్తున్నట్టు కనిపించింది.

అది ఒక అపూర్వమైన వింతజంతువు! దాని ఆకృతి చూడగా, మామూలు ఏనుగు కన్న నాలుగైదింతలు పెద్దదిగా వున్నది. అంత పెద్ద జంతువుకు తల మాత్రం చాలా చిన్నది.

ఏం జరుగుతుందో అని అందరూ దాని వైపే రెప్పవాల్చకుండా చూడసాగారు. అది మెల్లగా తన సన్నపాటి తలను సరస్సు లోపలికి సాచింది. కంటికి కనబడని ఆ వ్యక్తిని పట్టడానికి అది యత్నిస్తున్నట్టు తెలుస్తూనే వున్నది.

ఆ వింతజంతువు తల నీటిమట్టానికి ఒక్క గజం ఎత్తుకు వచ్చిందో లేదో, సరస్సు నీటి నుంచి వికృతమైన ఒక పెద్ద కేక వినిపించింది. కేక వినబడటం, చెట్టుకొమ్మ నుంచి వేళ్ళాడే పొడవాటి, వింతకళ్ళటోపీ కిందకు జారటం, ఒకేసారి జరిగింది.

ఆ మరుక్షణం సరస్సులో ఒక మనిషి, ఆ కళ్లటోపీ ధరించి వుండటం కనబడింది. ఆ మనిషి కనిపించీ కనిపించడంతోనే, వింతజంతువు సరస్సు ఒడ్డు నుంచి పరిగెత్త సాగింది.

"ఓహోం, నువ్వా, మహోదరా! నన్నే భక్షించదలిచావా? చతుర్నేత్రుణ్ణే మింగటానికి వచ్చావా?" అంటూ పెద్దగా కేకపెట్టాడు.

మాంత్రికుడు చతుర్నేత్రుణ్ణి చూసి సమరసేనుడూ, సైనికులూ కంపించిపోయారు. ఏకాక్షి మాంత్రికుడి బద్ధవిరోధి అయిన, ఇతడి కంటబడకుండా, యిప్పుడెలా తప్పించుకోవటం? అన్న ఆలోచనతో, సమరసేనుడు చుట్టూ కలయ చూడసాగాడు. — (ఇంకావుంది)






# కీర్తికాంక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు "రాజా, నువు ఇలా పడుతున్న శ్రమ అంతా కీర్తి ప్రతిష్ఠల కోసమే అయితే, నీ ప్రయత్నం సరి అయినది కాదు. కీర్తికీ, ప్రయత్నానికీ ఏమీ సంబంధం లేదు. ఈ సంగతి శ్రమ పడి తెలుసుకున్న ముకుందుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ముకుందుడు అనేవాడు ఒక గ్రామంలో ఒక సామాన్యపు రైతు కొడుకు. అయితే వాడికి అసాధారణమైన ధారణ శక్తి ఉండేది. అందుచేత వాడికి అన్ని విద్యలూ పట్టుబడ్డాయి. అయినా వాడు రైతుగానే జీవించవలసి వచ్చింది.

## బేతాళ కథలు



వాడు ఉండేది మామూలు గ్రామమే అయినా అది ఒకప్పుడు చరిత్రప్రసిద్ధి గల క్షేత్రం. అక్కడ అపూర్వమైన శిథిలాలూ, శాసనాలూ బయటపడ్డాయి. వాటిని చూడటానికి ఎంతో గొప్ప కీర్తి గల మనుషులు వచ్చేవారు. వారందరితోనూ మాట్లాడుతూంటే, ''వీళ్ళు నాకన్న తెలివి గలవాళ్ళు ఏమీ కారు. వీరికి ఇంత గొప్ప పేరు ఎలా వచ్చిందో?'' అనిపించి, తనకు కూడా కీర్తి వస్తే బాగుండు ననిపించేది ముకుందుడికి. ముకుందుడు ఈ మాట చాలామందితో అన్నాడు.

ఒక వృద్ధుడు ముకుందుడి కీర్తికాంక్ష గ్రహించి, ''ఈ మారుమూల ఊళ్ళో కూర్చుంటే నీ తెలివితేటలు ఏం రాణిస్తాయిరా? పేరు తెచ్చుకోవాలంటే నగరానికి పోవాలి!'' అన్నాడు.

ఈ మాటలో గురికుదిరి ముకుందుడు, తండ్రి ఎంత వద్దంటున్నా వినిపించుకోకుండా నగరానికి బయలుదేరాడు.

వాడు వెళ్ళే దారిలో పెద్ద అడవి ఉన్నది. ఆ దారిన ఒంటరిగా ప్రయాణం చెయ్యటానికి చాలామంది భయపడతారు. కాని అలా భయపడటం తనవంటి ధైర్యశాలికి అవమానం అనుకుని, ముకుందుడు ఒంటరిగానే అడవిదారి పట్టాడు.

సగం దారిలో ఒక దొంగ వాణ్ణి అటకాయించాడు. ముకుందుడు వాడితో తలపడి వాణ్ణి ఓడించాడు.

దొంగ ఆశ్చర్యంగా, ''పదేళ్ళుగా దొంగతనాలు చేస్తున్నాను. నా పేరు వింటేనే మహావీరులు కూడా హడలి చస్తారు. నీలాటి వాడు నాకు ఇంతవరకూ తగలలేదు,'' అన్నాడు.

తనచేతుల్లో ఓడినవాడు వీరేంద్రుడనే పేరుమోసిన గజదొంగ అని ముకుందుడు తెలుసుకుని, తాను కూడా ఆశ్చర్యపడ్డాడు.

''ఏదో విధంగా పేరుతెచ్చుకోవాలనే ప్రయత్నంలో ఉన్నాను, నాకూడా దొంగతనాలు నేర్పు, నీతో కలిసిపోతాను,'' అన్నాడు ముకుందుడు వీరేంద్రుడితో.



అందుకు దొంగ సంతోషంగా ఒప్పుకుని, "అయితే మనం నగరానికి పోదాం. అక్కడ నీకు చోరరహస్యాలన్నీ నేర్పుతాను," అన్నాడు ముకుందుడితో.

ఇద్దరూ నగరం చేరారు. వీరేంద్రుడు దొంగతనం చెయ్యటానికి ఒక ఇల్లు ఎన్నుకున్నాడు. రాత్రివేళ ఇద్దరూ ఆ ఇంటి ప్రహరీగోడ దూకి ఆవరణలో ప్రవేశించారు. ఇంటి పెరటి వాకిలి తలుపులను బయటినుంచే లాఘవంగా తెరిచాడు వీరేంద్రుడు. వాడి ప్రతి చర్యనూ ముకుందుడు శ్రద్ధగా గమనిస్తున్నాడు.

ఇద్దరూ ఇనప్పెట్టె ఉన్న గదిలోకి వెళ్ళారు. వీరేంద్రుడు ఒడుపుగా ఇనప్పెట్టె తెరిచి, అందులో ఉండిన డబ్బూ, నగలూ మూట కట్టాడు.

వాళ్ళు అక్కడినుంచి బయలుదేరబోతుండగా, వీరేంద్రుడు గోడకు తగిలించి ఉన్న ఒక స్త్రీ పటాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. తరవాత వాడు పక్కగదిలోకి తొంగిచూసి, అక్కడ నిద్రపోతున్న మనుషులను చూస్తూనే తన మూటను అక్కడే వదిలేసి, ముకుందుణ్ణి తీసుకుని ఆ ఇంటి నుంచి బయటపడ్డాడు.

"ఇదేం దొంగతనం? కష్టపడి దొంగిలించినదంతా అక్కడే వదిలేశావు!" అన్నాడు ముకుందుడు చిరాకుపడుతూ.

"ఒకసారి నేను అడవిలో తీవ్రంగా గాయపడి, స్పృహలేకుండా పడిపోయి, చావుబతుకుల మధ్య ఉంటే, ఒకావిడ బండిలో అటుగా వస్తూ, నన్ను తన బండిలో ఎక్కించుకుని, తన పుట్టింటికి తీసుకుపోయి, నాకు చికిత్స చేయించి కాపాడింది. ఈ ఇల్లు ఆమె భర్తది! ప్రాణం కాపాడిన వారిది పూచికపుల్ల కూడా ముట్టనన్నది నా నియమం!" అన్నాడు దొంగ.

వీరేంద్రుడి వంటి చాదస్తం మనిషి దగ్గిర తాను నేర్చుకునేది ఏమీలేదనిపించి, ముకుందుడు అప్పటికప్పుడే వాణ్ణి వదిలేశాడు.



నగరంలో ఎక్కడ బసచేయాలా అని ఆలోచిస్తూండగా ముకుందుడికి తలవని తలంపుగా న్యాయాధికారి శరశ్చంద్రుడితో పరిచయం కలిగింది.

న్యాయాధికారికి ఒంటరిగా భోంచెయ్య రాదన్న నియమం ఉండేది. ఆయన రోజూ ఎవరో అతిథిని తనతోబాటు భోజనానికి కూర్చోబెట్టుకునేవాడు. ఒకనాడు ముకుందుడు ఆయనకు అతిథిగా దొరికాడు. ఆయన ముకుందుడి పరిస్థితి తెలుసుకుని, ''నువు స్థిరపడేవరకూ మా ఇంటనే ఉండు,'' అన్నాడు.

ఆ నగరంలో చక్రధరుడు అనే మహావీరుడు ఉన్నాడు. అతన్ని ఎదిరించి ఓడిస్తే, తనకు కూడా మహావీరుడన్న ఖ్యాతి వస్తుందని ముకుందుడు ఆలోచించాడు. అయితే వాడు వెంటనే చక్రధరుణ్ణి ప్రతిఘటించకుండా, అతని అలవాట్లు తెలుసుకున్నాడు.

చక్రధరుడు ప్రతిరోజూ సాయంత్రం తన తోటలో ఒంటరిగా విహరిస్తాడు. ఒక రోజు ముకుందుడు చక్రధరుడి తోటలోకి ప్రవేశించి, ఒంటరిగా ఉన్న చక్రధరుణ్ణి అకస్మాత్తుగా కత్తిదూసి ఎదుర్కొన్నాడు.

''ఎవరు నువు?'' అని చక్రధరుడు ఆశ్చర్యంగా అడిగాడు.

''నిన్ను జయించి, నీకన్న గొప్ప వీరుణ్ణి అనిపించుకుందామని వచ్చాను,'' అన్నాడు ముకుందుడు.

''అలాంటప్పుడు ఇలా చాటుగా ఎందుకు వచ్చావు? పదిమంది ముందూ ధైర్యంగా ఈ మాట అనవచ్చుగా?'' అన్నాడు చక్రధరుడు.

''పదిమంది ముందూ ఓడిపోవడం నాకిష్టం లేదు. ముందుగా నీ సామర్థ్యం తెలుసుకుందామని ఇలా వచ్చాను,'' అన్నాడు ముకుందుడు.

వెంటనే చక్రధరుడు ఒర నుంచి కత్తి దూసి, ముకుందుణ్ణి ఎదుర్కొన్నాడు. క్షణాలమీద ముకుందుడు చక్రధరుణ్ణి నిరాయుధుణ్ణి చేశాడు.



చక్రధరుడు ఆశ్చర్యపోతూ, "నీది గురువు నేర్పిన విద్య లాగా తోచడంలేదు. నీ కిది సహజంగా అబ్బినట్టున్నది. నువు నాతో స్నేహంగా ఉంటే, నీ దగ్గిరకొన్ని మెలకువలు నేర్చుకుంటాను. ఏమంటావు?" అన్నాడు.

"అందువల్ల నా కేం లాభం?" అని ముకుందుడు అడిగాడు.

"నీకు రోజుకు వంద వరహాలు జీతం ఇస్తాను." అన్నాడు చక్రధరుడు.

గొప్పవాడనిపించుకోవడానికి డబ్బు అన్నిటినీ మించిన సాధనం. అందుచేత ముకుందుడు చక్రధరుడి కింద పని చెయ్యడానికి అంగీకరించాడు.

రెండు నెలల్లో చక్రధరుడు ముకుందుణ్ణి మించాడు. ముకుందుడి ఉద్యోగం ఊడింది. అయితే వాడు అందుకు బాధ పడలేదు. వాడి వద్ద ఆరువేల వరహాలు చేరాయి. ఆ డబ్బుతో వ్యాపారం చేసి, కీర్తి గడించవచ్చు ననుకుని ముకుందుడు రత్నాలశెట్టి సలహా కోరాడు. రత్నాలశెట్టి గొప్ప వ్యాపారస్థుడుగా పేరుమోసిన వాడు. అతని సలహాతో ముకుందుడు తాను కూడా వ్యాపారం చేసి, ఏడాదిలో లక్షాధికారి అయిపోయాడు.

"నీకు వచ్చిన లాభంలో పదోవంతు దానధర్మాల కింద ఖర్చుపెట్టు. అదే నీకు శ్రీరామ రక్ష!" అని రత్నాలశెట్టి ముకుందుడికి సలహా ఇచ్చాడు.

తాను లక్షాధికారి అయినా తనకు కీర్తి వచ్చినట్టు ముకుందుడికి అనిపించలేదు. వాడు రత్నాలశెట్టి సలహా పాటించలేదు. వాడు వ్యాపారం విడిచిపెట్టి, ఖ్యాతి కోసం చిత్రలేఖనమూ, సంగీతమూ చేపట్టి చూశాడు. ఎందునా వాడికి కీర్తి రాలేదు.

ఇలా ఉండగా ఒకనాడు ముకుందుడి తండ్రి నగరానికి వచ్చాడు.

"ఏమిటి, నాన్నా, ఇలా వచ్చావు?" అని ముకుందుడు తండ్రిని అడిగాడు.

"ఈ ఏడు మన పొలంలో ఎకరానికి మూడు పుట్లు పండించాను. అందుకోసం

నేను ఎంతోకాలంగా చేస్తున్న ప్రయత్నాలు ఇప్పటికి ఫలించాయి. రాజుగారు నన్ను సన్మానించటానికి పిలిపించారు," అన్నాడు ముకుందుడి తండ్రి.

ముకుందుడు తన తండ్రికి రాజసభలో జరిగిన గౌరవం కళ్ళారా చూసి ఎంతో ఆనందించి, తండ్రితోబాటు తాను కూడా తన గ్రామానికి తిరిగిపోయి, వెనకటిలాగే మళ్ళీ పొలం పనులు చూసుకుంటూ, కీర్తికాంక్షకు స్వస్తి చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ముకుందుడి కీర్తి కాంక్ష ఎందుకు పోయింది? తనకు కీర్తి తెచ్చుకునే సామర్థ్యం లేదని తోచటంవల్లనా? లేక, తండ్రిని చూడగానే అతడికి ఇంటి మీద గాలి మళ్ళిందా? అతను తాను చేసిన ప్రయత్నాలన్నిటిలోనూ తనదే పైచేయి అని నిరూపించుకున్నాడు గదా, కీర్తి పట్ల నిరాశ ఎందుకు కలగాలి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ముకుందుడు కీర్తి కొన్ని రంగాలలోనే సాధ్యమని పొరపాటుపడ్డాడు. దాదాపు ఏ రంగంలోనైనా కీర్తి తెచ్చుకునే శక్తిసామర్థ్యాలు వాడికి ఉన్నాయి. కాని నిజమైన కీర్తి తెచ్చుకుని, నిలబెట్టుకునే సాధనా, నియమబద్ధతా వాడిలో లేవు. వ్యవసాయంలో తన తండ్రి దేశానికంతకూ అగ్రగణ్యుడుగా ఎప్పుడైతే పేరు తెచ్చుకున్నాడో, అప్పుడే ముకుందుడు తన పొరపాటు తెలుసుకున్నాడు. కీర్తి కోసం తాను ఇంత దేశం తిరిగి, ఇన్ని రంగాలు తడవనవసరంలేదు; దీక్ష ఉంటే తన గ్రామం నుంచి కదలకుండానే ఏదో రంగంలో కృషి చేసి, కీర్తిమంతుడు కావచ్చు. ఈ సంగతి గ్రహించిన ముకుందుడు తండ్రి వెంట ఇంటికి తిరిగి వెళ్ళాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






సింగన్న తాతలూ, ముత్తాతలూ దొంగతనమే తమ వృత్తిగా చేసుకున్నారు. అందుచేత సింగన్న కూడా దొంగగానే జీవిస్తూ వచ్చాడు. సింగన్నకు రాముడు అనే కొడుకు ఉన్నాడు. వాడికి తన వృత్తి నేర్పి, తాను విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు సింగన్న. కాని, తండ్రి చెప్పినట్టు దొంగతనం వృత్తిగా అవలంబించటానికి రాముడు ఒప్పుకోలేదు.

రాముడు మరొక మార్గాన జీవించటానికి నిశ్చయించి, ఊరంతా పని కోసం తిరిగాడు. నాగరాజు అనే వర్తకుడు రాముణ్ణి కాపలావాడుగా పెట్టుకున్నాడు. రాముడు ఆరునెలలపాటు పనిచేశాడు.

నాగరాజు దగ్గిర రెండు విలువైన రత్నాలున్నాయి. ఒక దూర దేశంలో అలాటి రత్నాలకు గిరాకి వచ్చింది. అలాటి రత్నాలే సోమిశెట్టి వద్ద మరి నాలుగు ఉన్నాయి. ఈ ఆరు రత్నాలూ ఆ దూర దేశానికి పంపితే మంచి ధర వస్తుంది. నాగరాజు సోమిశెట్టి వద్ద ఆ రత్నాలను కొనటానికి ప్రయత్నించవచ్చు. కాని, అలా చేస్తే సోమిశెట్టి ఆ రత్నాలను తాను కొన్న ధరకు దరిదాపులలో అమ్మడు. అందుచేత వాటిని దొంగిలించటం ఉత్తమ మార్గమని నాగరాజుకు తోచింది.

అతను రాముణ్ణి రహస్యంగా పిలిచి, సోమిశెట్టి తన నాలుగు రత్నాలనూ ఎక్కడ దాచాడో చెప్పి, వాటిని దొంగిలించి తెస్తే మంచి బహుమానం ఇస్తానన్నాడు.

''బాబూ, అసలు మాది దొంగవంశమే. మా పూర్వీకులదీ, నా తండ్రిదీ కూడా దొంగతనమే వృత్తి. ఆ వృత్తిలోకి దిగటం ఇష్టంలేక, నేను మా నాన్నతో వివాదపడి, మీ వద్ద కాపలాపనికి కుదిరాను. ఇంత కాలమూ విశ్వాసపాత్రుడుగా పనిచేసిన

ఇవటూరి భవానీశంకర్

తరవాత, ఇప్పుడు మీరు నన్ను దొంగతనం చెయ్యమంటున్నారు! నేను ఆ పని చెయ్య లేను, క్షమించండి,'' అన్నాడు రాముడు.

వెంటనే నాగరాజు ఆశ్చర్యమూ, ఆగ్రహమూ ప్రకటించుతూ, ''ఏమిటేమిటీ? మీది దొంగవంశమా! ఈ మాట పనిలో చేరేటప్పుడు చెప్పక, ఇప్పుడు చెబుతున్నావా? వెంటనే పనిమానుకో!" అన్నాడు.

రాముడు పని మానుకున్నాడు.

ఇది జరిగిన మర్నాడే సోమిశెట్టి నాగరాజు వద్దకు వచ్చి, ''చూడు, నాగరాజూ! నేను నెలరోజుల పాటు వ్యాపారం మీద పోతున్నాను. దొంగల బెడద హెచ్చుగా ఉన్నది. ఈ రత్నాలు నాలుగూ భద్రంగా నీ దగ్గిర ఉంచి, నేను వచ్చినాక నాకు తిరిగి ఇయ్యి.'' అంటూ నాలుగు రత్నాలనూ నాగరాజు పరం చేసి వెళ్ళిపోయాడు.

తరవాత కొన్ని రోజులకు సోమిశెట్టి నాగరాజు వద్దకు తిరిగి వచ్చి, తన రత్నాలు తనకు ఇచ్చెయ్యమన్నాడు.

నాగరాజు తొణకక, బెణకక, ''నువు నాకు రత్నాలు ఎప్పుడిచ్చావు? ఎందుకిచ్చావు? నా దగ్గిర కాగితం ముక్క అయినా తీసుకుని ఉంటావుగా? కాగితం ఏమన్నా ఉన్నదా?'' అని సోమిశెట్టిని అడిగాడు.

సోమిశెట్టి నాగరాజు కేసి చురుకుగా చూసి, ''నీ బుద్ధి ఇలాంటి దని రాముడు చెబితే నేను నమ్మలేదు. నిజం తెలుసుకుందామని నేను నీకు ఆ రత్నాలను ఇచ్చాను. అవి ఇప్పుడు నీ వద్ద లేవులే! రాముడు ఎప్పుడో వాటిని నీ వద్ద నుంచి తెచ్చి నాకిచ్చాడు! ఇవిగో!'' అంటూ తన జేబులో నుంచి నాలుగు రత్నాలూ తీసి చూపి, ''నువు ఎటువంటి వాడివో తెలిసి పోయింది! నీ గురించి తెలియవలసిన వాళ్ళకందరికీ చెబుతాను,'' అంటూ వెళ్ళిపోయాడు.

ఆ రోజునే సోమిశెట్టి రాముణ్ణి మంచి జీతం మీద, తనకు కాపలావాడుగా పెట్టుకున్నాడు.



# శాపనార్థాలు

శేషమ్మకూ, పోలమ్మకూ బద్ధవైరం. ఒకరోజు పోలమ్మ అవును కొనడానికి సంతకు బయలు దేరుతుంటే, "అవును కొనబోతున్నావా, పిచ్చిదానా? నువ్వు తీసుకుపోయే డబ్బు కూడా పోగొట్టుకుని తిరిగి వస్తావు," అన్నది శేషమ్మ. తన నోటిశాపం తగిలి తీరుతుందని ఆమె నమ్మకం.

పోలమ్మ శేషమ్మ మాట వినిపించుకోకుండా సంతకు వెళ్ళింది. సాయంత్రం ఆమె వట్టి చేతులతో తిరిగి వస్తూండటం చూసి శేషమ్మ తన శాపం తగిలిందనుకుని, "ఏం, పోలమ్మా? వట్టి చేతులతో తిరిగి వచ్చావు? అవునులే! ఎంత పడ్డవాళ్ళకు అంతా జరిగి తీరుతుంది," అన్నది.

"అది కాదులే శేషమ్మా. నేను సంతలో ఆరువందలకు అవును కొని తీసుకు వస్తూంటే, పక్క ఊరి షావుకారు అవును చూసి ముచ్చటపడి, వెయ్యి రూపాయలకు అమ్మమన్నాడు. నాలుగువందలు లాభం ఎందుకు పోనియ్యాలని ఆయనకు అవును అమ్మి, డబ్బు తీసుకుని వస్తున్నా. నువ్వన్నట్టు ఎంత పడ్డవాళ్ళకు అంతా జరిగి తీరుతుంది," అంటూ పోలమ్మ తన ఇంటికి వెళ్ళింది.

— శరత్





# లోభి అల్లుళ్ళు

బీదరైతు కామరాజు ఇద్దరు కూతుళ్లకూ పెళ్ళిచేసి చితికిపోయాడు. పెళ్లిళ్ళ ఖర్చుల కింద ఉన్నదంతా ఊడ్చిపెట్టుకు పోగా, చారెడు పొలమూ, బండీ, ఏడ్లూ మిగిలాయి.

పెళ్ళిళ్ళు అయిన ఆరు నెలలకు సంక్రాంతి వచ్చింది. పండగకు కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ ఆహ్వానించమని కామరాజుతో అతని భార్య అన్నది. కామరాజు ఆ మాటలకు తల ఆడించాడే గాని, ఏమీ చేయదలచలేదు.

అయితే కాపరానికి వెళ్ళిన చిన్న కూతురికి పుట్టింటి మీద గాలి మళ్ళి, తన భర్తతో సంక్రాంతి పండగకు పోదామన్నది.

''మీ నాన్న పిలవలేదు గదా? పిలవని పేరంటానికి దేనికి ?'' అన్నాడు చిన్న అల్లుడు.

''మనల్ని మా నాన్న పిలవాలా? పండగ గదా, వెళదాం!'' అన్నది చిన్న కూతురు.

చిన్న అల్లుడు సరే నన్నాడు.

అలాగే కామరాజు పెద్దకూతురు కూడా తన భర్తను పండగకు తన పుట్టింటికి బయలుదేర దీసింది. పెద్ద అల్లుడు మొదట ఒప్పుకో లేదు.

''మా నాన్న చిన్న అల్లుడికి పండగ కానుకలు ఇచ్చాడనుకోండి! మీకు కూడా కానుకలు ముట్టకపోతే నా కెంత నగుబాటు ?'' అన్నదామె.

ఈ మాటకు అభిమానం పొడుచుకు వచ్చి, పెద్ద అల్లుడు కూడా తన భార్యతో అత్తవారింటికి బయలుదేరాడు.

బాజా భజంత్రీలతో సహా ఆహ్వానం అందినట్టుగా తన కూతుళ్ళూ, అల్లుళ్ళూ దిగటం చూసి కామరాజు ఆశ్చర్య

ఎమ్. వి. వి. సత్యనారాయణ

పోయాడు. అతని భార్య మాత్రం, తన మాట తీసెయ్యకుండా తన భర్త వాళ్ళను పిలిపించాడనుకుని ఎంతగానో మురిసి పోయింది.

పండగ ఎలాగో గడిచింది. కాని కామరాజు అల్లుళ్ళకు పండగ కానుకలు ఇచ్చే ఉద్దేశమేమీ కనబరచలేదు. అది చూసి అల్లుళ్ళు ఇద్దరూ ఒకే అపోహకు గురి అయారు: ఒకరికి తెలియకుండా మరొకరికి మామగారు కానుకలు ఇచ్చే ప్రయత్నంలో ఉన్నాడనుకున్నారు. వాళ్ల అనుమానానికి తగ్గట్టే, కామరాజు తన కూతుళ్ళూ, అల్లుళ్ళూ వెళ్ళి పోనున్న రోజున ఎవరికీ కనిపించకుండా ఎటో వెళ్ళిపోయాడు!

పెద్దకూతురు ఏకాంతంగా తన తల్లిని తన భర్తకు ఇయ్యవలసిన పండగ కానుక గురించి హెచ్చరించింది.

తల్లి అయోమయంగా, "మీ నాన్న ఇంట్లో ఉన్న ధాన్యం అమ్మి, నీ పెళ్లి కయిన అప్పులు తీర్చి, ఏమన్నా మిగిలితే కానుక ఇచ్చేవారేమో?" అన్నది.

ఈ మాటలు చాటున ఉన్న చిన్న కూతురి చెవినపడ్డాయి. ఆమె కూడా గబగబాపోయి పండగకానుకలు గురించి తల్లిని అడిగింది.

"మీ నాన్న ఎడ్లను అమ్మి నీ పెళ్ళి కయిన అప్పు తీర్చి, ఏమన్నా మిగిలితే కానుకలు ఇస్తారేమో? ఆ సంగతి నాకు తెలియదు," అన్నది తల్లి.



ఈ సమాచారం తమ భార్యల ద్వారా అల్లుళ్ళు తెలుసుకున్నారు. పెద్ద అల్లుడు బండికి ఎడ్లను పూన్చి, బండి మీద ధాన్యం బస్తాలు వేసుకుని సంతకు బయలుదేరారు. చిన్న అల్లుడు సమయానికి పరిగెత్తుకుంటూ వచ్చి ఆ బండీలోనే ఎక్కాడు.

బండీ సంతకు చేరింది. పెద్ద అల్లుడు ధాన్యం అమ్మడానికి ఒక వైపూ, చిన్న అల్లుడు ఎడ్లను అమ్మడానికి ఇంకోవైపూ బయలుదేరాడు. ఇద్దరికీ అమ్మకాల గొడవ తెలీదు.

ధాన్యం వర్తకులు పెద్ద అల్లుడి చుట్టూ చేరి ధాన్యం ధర అడిగారు.

పెద అల్లుడు ఏదో గుణించుకుని, నోటికి వచ్చిన ధర చెప్పాడు. వర్తకులు గొల్లున నవ్వారు. అతను అడిగినది చిల్లరగా అమ్మే బియ్యం ధర! వర్తకులు ఎందుకు నవ్వారో పెద్ద అల్లుడు ఊహించలేక, ''మీరు ధాన్యం ఏ ధరకు కొంటారు?'' అని అడిగాడు.

అతను ఈ ధాన్యం ఎక్కడో దొంగతనం చేసి ఉంటాడని అనుమానం కలిగి, వర్తకులు పెద్ద అల్లుణ్ణి రక్షకభటులకు అప్పజెప్పారు.

చిన్న అల్లుడి గతీ అంతే అయింది. ఎడ్లను బేరం చేసేవాళ్లు వచ్చి ధర అడిగితే అతనికి ఏం చెప్పాలో తెలియక. పక్కనే ఉన్న నేతివర్తకుణ్ణి సలహా అడిగాడు. ఎడ్లను కొనేవాళ్ళకు అనుమానం తగిలి, అతను ఎవరి ఎడ్లనో తెచ్చి అమ్మజూస్తున్నాడని, రక్షకభటులకు పట్టి ఇచ్చారు.

తన అల్లుళ్ళు చేసిన ఘనకార్యం కామరాజుకు తెలిసి, అతను వాళ్ళను రక్షకభటుల బారినుంచి విడిపించే సరికి, అతనితలప్రాణం తోకకువచ్చినట్టయింది. అతను అల్లుళ్ళకు ఏదో కానుకలు ఇచ్చే ఉద్దేశంతోనే డబ్బు అప్పుతేవటానికి పక్క గ్రామం వెళ్ళాడు. కాని అది కాస్తా రక్షకభటుల చేతులు తడిచెయ్యటానికి సరిపోయింది.





# స్వర్ణపాత్ర

అయిదు కల్పాలనాడు బోధిసత్వుడు సేరివ అనే రాష్ట్రంలో పాత్రసామగ్రి అమ్మే వర్తకుడుగా జీవించాడు. అతను పాత పాత్రలు కొనేవాడు, కొత్త పాత్రలు అమ్మేవాడు. ఈ వ్యాపారంలో బోధి సత్వుడు న్యాయమైన లాభం మాత్రమే ఆశించేవాడు.

ఆ రాష్ట్రంలోనే పాత్ర సామగ్రి క్రయ విక్రయాలుచేసే వర్తకుడు ఇంకొకడు ఉండేవాడు. అతను పరమలోభి. బోధి సత్వుడూ, అతనూ కలిసే వ్యాపారం చేస్తూ తిరిగేవారు.

ఒకసారి ఇద్దరూకలిసి తేలివాహ అనే నదిని దాటి అంధ్రపురం చేరుకున్నారు. ఒకరి వ్యాపారానికి ఇంకొకర్షు అడ్డు లేకుండా, పురంలోని వీధులను భాగించు కుని, ఎవరి వీధులలో వారు వర్తకం సాగించటానికి బయలుదేరారు.

ఆ అంధ్రపురంలో ఒక శ్రేష్ఠికుటుంబం ఉంటున్నది. వాళ్లు ఒకప్పుడు ధనికులే కాని, ఇప్పుడు చితికిపోయారు. ఆ కుటుం బానికి చెందిన కొడుకులూ, అన్న ధమ్ములూ, సంపదాపోగా, ఒక కన్యా, ఒక అవ్వా, వారి దారిద్ర్యమూ మాత్రమే మిగలటం చేత, వాళ్ళిద్దరూ అక్కడా యిక్కడా కూలి చేసుకుని పొట్ట పోసు కుంటున్నారు.

వారి వద్ద అనేక పాత్రలున్నాయి. వాటిలో ఒకటి బంగారు పాత్ర. బాగా బతికిన రోజుల్లో శ్రేష్ఠి ఉపయోగించినది, వాడుకలేని కారణంచేత అది మకిలపట్టి ఉన్నది. అది బంగారుది అని ఆడ వాళ్ళిద్దరూ ఎరగరు.

లోభివర్తకుడు, "పణికలు కావాలా? మణికలు కావాలా?" అని కేకవేస్తూ, ఈ ఆడవాళ్లు ఉంటున్న ఇంటిముందుకు

వచ్చాడు. పణికలు అంటే దండలు; మణికలు అంటే ముంతలు.

ఆ కేక విని చిన్నపిల్ల ముసలి దానితో, ''అమ్మా, నా కేమైనా కొని పెట్టవా?'' అని అడిగింది.

''ఏం పెట్టి కొననమ్మా? మన దగ్గిర ఏ మున్నదని?'' అన్నది తల్లి.

''మన దగ్గిర వాడకుండా ఉన్న పాత్ర ఉన్నది గదా, అది పెట్టి కొను,'' అన్నది కూతురు.

పెద్దావిడ లోభివర్తకుణ్ణి లోపలికి పిలిచి, కూర్చోమని, మర్యాదచేసి, అతనికి పాత్ర ఇచ్చి, ''బాబూ, ఇది తీసుకుని నీ చెల్లెలికి ఏమైనా వస్తువు ఇయ్యి,'' అన్నది.

లోభివర్తకుడికి ఆ పాత్రను చూడగానే అది బంగారు పాత్రకావచ్చునని తోచింది. అతను దాన్ని తిరగేసీ, బోర్లవేసీ, తిప్పి తిప్పి చూసి, కడ్డీతో గీరి, అది బంగారమే నని రూఢిచేసుకుని, దాన్ని కాజెయ్యటానికి నిశ్చయించుకుని, ''దీనికి ఏం వస్తుందమ్మా? దీని ఖరీదు చాలా స్వల్పం,'' అంటూ ఆ పాత్రను విసిరి వేసి, లేచి వెళ్ళిపోయాడు.

వర్తకులకు మధ్య ఏర్పరచుకున్న నియమం ప్రకారం ఒకరు వెళ్ళిన వీధికి, వాళ్ళు వెళ్ళిపోయిన అనంతరం రెండవ వాడు వెళ్ళవచ్చు.

ఆ కారణంచేత, కొంత సేపటికి బోధిసత్వుడు, ఆ వీధికి వచ్చి, ''మణికలు



కావాలా ?'' అంటూ స్త్రీలున్న ఇంటి ముందుకు వచ్చాడు.

ఆ కేక విని కూతురు తల్లితో. ''అమ్మా. ఏదన్నా కొని పెట్టవే!'' అని తల్లిని అడిగింది.

''ఆ పాత్ర తప్ప ఏముున్నదమ్మా? అది ఎందుకూ పనికిరాదని ఒక వర్తకుడు విసిరికొట్టి వెళ్ళిపోయాడాయె. ఏం పెట్టి కొనమంటావు?'' అన్నది తల్లి.

''ఆ వర్తకుడు మంచివాడు కాడమ్మా, దుడుకుమనిషి. ఈ వర్తకుడి మాట చూడు ఎంత సౌమ్యంగా ఉన్నదో!'' అన్నది కూతురు.

తల్లి బోధిసత్వుణ్ణి లోపలికిపిలిచి, పాత్రను అతని చేతికి ఇచ్చింది.

బోధిసత్వుడు దాన్ని చూసి బంగారు పాత్ర అని గ్రహించి, ''అమ్మా, ఇది లక్ష విలువచేస్తుంది. దీనికి సమానమైన విలువగల వస్తువులు నా వద్ద లేవు.'' అన్నాడు.

''నాయనా, ఇంకో వర్తకుడు ఇది గుడ్డిగవ్వ చెయ్యదని చెప్పి, విసిరికొట్టి వెళ్ళిపోయాడు. ఒకవేళ ఇది బంగారమో ఏమో! దీన్ని నువు తీసుకుని, దానికి బదులుగా ఏదన్నా ఇచ్చివెళ్ళు.'' అన్నది ముసలావిడ.

బోధిసత్వుడు తన వద్ద ఉన్న అయిదు వందల వెండి మాడలూ, అయిదు వందల వెండి మాడలు చేసే పాత్రసామగ్రి ఆ ఆడవాళ్ళకు ఇచ్చి, ''అమ్మా, ఎనిమిది



వెండి మాడలూ, సంచీ, త్రాసూ తప్ప తతిమ్మావన్నీ మీకిస్తున్నాను, తీసుకోండి,'' అని సువర్ణపాత్ర తీసుకొని బయలు దేరాడు.

అతను ఉంచుకున్న ఎనిమిది వెండి మాడలూ, నది దాటేందుకు పడవ కిరాయికి పనికివచ్చాయి.

తరవాత లోభివర్తకుడు తాను వేసుకున్న పథకం ప్రకారం ఆ స్త్రీలున్న ఇంటికి వచ్చి, "ఆ పాత్ర ఇలా పారేసి, ఏదో ఒకటి తీసుకోండి,'' అన్నాడు గొప్పత్యాగం చేస్తున్నట్టుగా.

ముసలావిడకు మండుకొచ్చింది. ఆమె ఆ లోభితో, "ఏం, నాయనా? లక్ష విలువ చేసే పాత్ర రేలీ విలువచెయ్యదంటివిగా! నువు వెళ్ళిం తరవాత ఇంకో ధర్మాత్ముడు యిక్కడికి వచ్చి, వెయ్యిమాడల విలువ ఇచ్చి ఆ పాత్రను తీసుకుపోయాడు!'' అన్నది.

ఈ మాట వినగానే లోభివర్తకుడికి మతిపోయినట్టయింది.

"లక్షచేసే పాత్రను వాడు కాజేశాడా? నాకు ఇంత నష్టం కలిగించాడా?'' అంటూ వాడు ఆవేశపడిపోయి, ఏడుస్తూ, మతి పూర్తిగా చెడి, తన సరుకులూ, డబ్బూ ఆ ఆడవాళ్ళ దగ్గిరే వదిలేసి, పై బట్ట జారిపోయినది కూడా తెలియకుండా, త్రాసు చేతబట్టుకుని నదీతీరానికి పరుగు, పరుగున వెళ్ళాడు. అతడికి, బోధిసత్త్వుడు పడవలో నది దాటుతూండటం కనబడింది.

లోభివాడు పడవను వెనక్కు రమ్మని కేక పెట్టాడు. వెనక్కు పోవద్దని పడవ వాడితో బోధిసత్త్వుడు అన్నాడు. బోధిసత్త్వుడు అవతలి ఒడ్డుచేరటం చూడగానే లోభివాడి ఆవేశం కట్టలు తెంచుకున్నది. గుండె వేగంగా కొట్టుకోసాగింది. నోట రక్తం వెలువడింది. బోధిసత్త్వుడి మీది ద్వేషంతో గుండె పగిలి, లోభివర్తకుడు అక్కడే ప్రాణాలు వదిలాడు.

బోధిసత్త్వుడు దానాలూ, పుణ్యకార్యాలూ చేస్తూ జీవించాడు.





## బుద్ధుడి ప్రస్థానం

బుద్ధత్వం పొందిన సిద్ధార్థుడు జనన మరణ బంధాల నుంచి విముక్తుడై నిర్వాణం పొందగల స్థితిలో ఉన్నాడు. కాని మానవజాతి పీడితదశలో, అజ్ఞానాంధ కారంలో ఉండటం చూసి, అతను నిర్వాణం పొందే ఆలోచన మాని, ప్రజలకు జ్ఞానబోధ చేయ సంకల్పించాడు.

మొట్ట మొదట అతను తనను విడిచి పోయిన అయిదుగురు తపస్వుల కోసం వెతుకుతూ, వారాణసి సమీపంలో ఉండిన ఒక వనంలో వారిని చూశాడు. వాళ్ళు అతన్ని ముందు లక్ష్య పెట్టలేదు, కాని అతను సమీపానికి వచ్చేసరికి వారు వివశులై, అతనికి ప్రణామం చేశారు.





తరవాత బుద్ధుడికి శిష్యుడైనవాడు ఒక ధనికుడి కుమారుడు యశుడు అనేవాడు. యశుడి తండ్రి మండిపడి, తన కొడుకును తీసుకుపోవటానికి వచ్చాడు. బుద్ధుడు తండ్రితో కొద్దిసేపు ప్రసంగించిన మీదట అతను కూడా బుద్ధుడికి శిష్యుడు అయాడు.



ఒక కొలను గట్టున కొందరు సంపన్ను లైన యువకులు తమ భార్యలతో సహా విహారాలు చేస్తున్నారు. వారిలో ఒక బ్రహ్మచారి తన వెంట ఒక నర్తకిని తెచ్చుకున్నాడు. అందరూ నిద్రించే టప్పుడు ఆ నర్తకి అందరి నగలూ అపహరించి పారిపోయింది.

యువకులు నిద్రలేచి, ఆమెను పట్టుకోవ టానికి బయలుదేరారు. దారిలో వారికి బుద్ధుడు తగిలాడు. "నర్తకి కోసం అన్వేషించటమా, మీ ఆత్మలను అన్వే షించుకోవటమా? ఏది మంచిది?" అని బుద్ధుడు వారిని అడిగాడు. వారు జడత్వం వదిలి, బుద్ధుడి శిష్యులయారు.





ఉరువేల వద్ద కస్సపుడు (కశ్యపుడు) అనే ప్రసిద్ధ తపస్వి అయిదువందల మంది శిష్యులతో ఉండేవాడు. తాను మహాజ్ఞానినని గర్వపడేవాడు. అతనికి బుద్ధుడు తన మతం బోధించి, అతన్నీ, అతని శిష్యులనూ తన శిష్యవర్గంలో చేర్చుకున్నాడు.

కన్సపుడూ, అతని శిష్యులూ తమ జటలను కత్తిరించి నదిలో పారేశారు. అనేక యోజనాల దూరాన మరి ఇద్దరు తపస్వుల శిష్యులు నదిలో స్నానం చేస్తూ, నీటిలో కొట్టుకువచ్చే జటలను చూసి కుతూహలం చెంది, ఉరువేలకు వచ్చి, బుద్ధుడి వెంట ఉండిపోయారు.





బుద్ధుడి ఖ్యాతి విస్తరించింది. అనం ఖ్యాతులైన శిష్యులను వెంటబెట్టుకుని బుద్ధుడు రాజగృహానికి వచ్చాడు. బింబిసారమహారాజు అతనికి గౌరవ పురస్సరంగా అతిథ్యమిచ్చి,తన చేత్తో బుద్ధుణ్ణి తినిపించాడు.

బుద్ధుడి తండ్రి శుద్ధోదనుడు బుద్ధుణ్ణి కపిలవస్తుకు ఆహ్వానిస్తూ దూతలను పంపాడు. వెళ్ళిన దూతలు తిరిగి రాలేదు; వారు బుద్ధుడి వెంట ఉండి పోయారు. అయినప్పటికి బుద్ధుడు కపిలవస్తుకు వచ్చాడు. అతనికి అతని తండ్రీ, మారు తల్లీ, తదితరులు ఘన మైన స్వాగతం ఇచ్చారు.





రాజకుటుంబానికి చెందిన వారందరూ బుద్ధుణ్ణి చూడవచ్చారు, కాని అతని భార్య యశోధర రాలేదు. "నేను ఆయన దయకు పాత్రురాలినైతే ఆయనే నా వద్దకు వస్తాడు," అన్నదామె. నిజానికి ఆమె సన్యాసిని జీవితమే గడుపుతున్నది. చివరకు బుద్ధుడు ఆమెను చూడటానికి తానే వచ్చాడు.

బుద్ధుడు సన్యసించిన కారణంగా అతని స్థానంలో అతని జ్ఞాతిఅయిన ఆనందుణ్ణి రాజు చెయ్యటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ రోజే అతని వివాహం కూడా జరగనున్నది. కపిలవస్తు ఉత్సాహ సంరంభంలో ఉన్నది. పెళ్ళికొడుకూ, రాజుకానున్న ఆనందుడు చక్కగా ముస్తాబై ఉన్నాడు.





ఆనందుడు బుద్ధుడి ఆశీస్సుల కోసం వచ్చాడు. బుద్ధుడు అతనికి తన భిక్షాపాత్ర ఇచ్చి, ప్రయాణమయాడు. ఆనందుడు బుద్ధుడి వెంట నడిచాడు. ఆనందుడి వధువు ఈ దృశ్యాన్ని కిటికీ నుంచి చూసి ఏడ్చింది. కాని బుద్ధుడు తన భిక్షాపాత్ర తాను తీసుకోలేదు. ఆనందుడు దాన్ని అతనికి తిరిగి ఇయ్యలేక, బుద్ధుడి వెంట వెళ్ళాడు.

# తృప్తి

వెంకడు రాజధానిలో జరిగే శ్రీరామనవమి ఉత్సవాలు చూడటానికి మొదటిసారిగా వెళ్ళాడు. రాజుగారి దివాణంలో జరిగే ఈ ఉత్సవాలకు ఎంతో ప్రసిద్ధులైన కళాకారులు వస్తారు. మొదటి రోజు గాయకులు అద్భుతంగా పాడారు. విన్న వాళ్ళందరితోబాటు వెంకడు కూడా తన్మయత్వం చెందాడు. అయితే తనకు గానకళ అబ్బనందుకు విచారపడ్డాడు. రెండోరోజు కవులు గొప్పగా పద్యాలు చదివారు, పండితులు హర్షించారు. కొందరి కవిత్వం వాడికి సులభంగా అర్థమయింది. అయినా అలా పద్యాలు రాయలేనందుకు వాడు బాధపడ్డాడు. మూడోనాడు శిల్పాలూ, చిత్ర లేఖనాలూ ప్రదర్శించ బడ్డాయి. వెంకడి కళ్ళకు అవి ఏ దేవతలో రచించినవిగా ఉన్నాయి. తన జన్మలో తాను ఒక్క చిన్న బొమ్మకూడా గీయలేనందుకు వాడు కుంగిపోయాడు.

ఉత్సవాలు ముగిసి వెంకడు తిరిగి వస్తూ రాజధాని వీధుల్లో ఒక చేతులులేని మొండివాణ్ణీ, గుడ్డివాణ్ణీ, ఒక చెవిటివాణ్ణీ చూశాడు. అకస్మాత్తుగా వాడికి వాళ్ళను చూస్తే జాలివేసింది. ఎక్కడి నుంచో వచ్చి తాను సంగీతమూ, సాహిత్యమూ, చిత్రకళా చూసి ఆనందించాడు. వీళ్ళు రాజధానిలో ఉండి కూడా వాటిని ఆనందించ లేరు.

ఈ మాట స్ఫురించగానే వాడు ఆత్మసంతృప్తి చెందాడు. —సి. అముదేశ్వరి





# అన్నదమ్ములు

ఒక ఊళ్ళో ఒక వ్యాపారికి ఇద్దరు కొడుకులు. చిన్నవాడు పొరుగూరు వెళ్ళి ఉన్న సమయంలో వ్యాపారికి ప్రాణం మీదికి వచ్చింది. అతను పెద్ద వాడితో, "నాయనా, నేను బతకను. ఇంతవరకూ కలిసి ఉన్నట్టే, నేను పోయాక కూడా నువ్వూ, తమ్ముడూ కలిసి ఉండండి. వాడిది చిన్నప్పటి నుంచీ చాలా దుడుకు స్వభావం. అందుచేత నువే వాడితో ఏదోవిధంగా సర్దుకుపోవాలి," అని చెప్పి, ప్రాణాలు వదిలాడు.

ఆఖరుక్షణంలో తన మామగారు తన బావగారితో ఏదో అన్నట్టు చిన్నవాడి భార్య గమనించింది. కాని వాళ్ళు ఏమి మాట్లాడుకున్నదీ ఆమెకు తెలియదు. తెలుసుకునే అవకాశం లేకుండా వ్యాపారి ఆ వెంటనే మరణించటం జరిగింది. ఊరికి వెళ్ళిన చిన్నవాడు వచ్చాడు. అన్నదమ్ములు తమ తండ్రికి దహన సంస్కారం చేశారు.

తరవాత చిన్నవాడితో వాడి భార్య, "మీ అన్నగారు మీతో ఏమైనా అన్నారా?" అన్నది.

"దేన్ని గురించి?" అని చిన్నవాడు భార్యను అడిగాడు.

"ఏమీ తెలీదు! చనిపోయే ముందు మామగారు బావగారితో ఏదో గుసగుసలాడారు. ఎక్కడన్నా డబ్బు దాచి ఉంచి, ఆ విషయం పెద్ద కొడుక్కు చెప్పుకున్నారేమో! ఆయన ఆ సంగతి మీతో అనకపోవడం నుంచి అనుమానంగా ఉన్నది," అన్నది చిన్నవాడి భార్య.

"మా అన్న అలాటి వాడుకాడు," అన్నాడు చిన్నవాడు.

"డబ్బు దగ్గర ఎవరు ఎలాటి వారో చెప్పడం కష్టం," అన్నది వాడి భార్య.

గంగిశెట్టి శివకుమార్

ఆమెకు ఉమ్మడికాపరం సుతరామూ ఇష్టం లేదు. మామగారు బతికి ఉన్నంత కాలమూ ఆమె అన్నదమ్ములను చీల్చ లేకపోయింది. ఇప్పుడు మామగారు పోవడమే గాక, అన్నదమ్ముల మధ్య భేదం ఏర్పడడానికి ఒక ఆధారం కూడా దొరికింది. ఆమె వేసిన విషబీజం చిన్న వాడి మనసులో నాటుకుని, వృద్ధి చెంద సాగింది.

వాడు ఒకరోజు పెద్దవాడితో, ''నాన్న చనిపోయే ముందు నీకు ఏదో చెప్పాడట, ఏమిటది ?'' అన్నాడు.

''ఏముందిరా? తాను పోయినాక కూడా మనం ఇలాగే కలిసి ఉండా లన్నాడు,'' అన్నాడు పెద్దవాడు.

చిన్నవాడికి తృప్తి కలగలేదు. వాడి అసంతృప్తిని వాడి భార్య పనిపెట్టుకుని పెంచింది. ఒకరోజు వాడు పెద్దవాడితో, వేర్లు పడదామన్నాడు.

''అంత అవసరం ఏ మొచ్చిందీ?'' అని పెద్దవాడు అడిగాడు.

చిన్నవాడు తనకు తన అన్నపట్ల ఉన్న అనుమానం బయట పెట్టేశాడు. పెద్ద వాడికి నోటమాట రాలేదు. వాడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చి, తన భార్య ఒంటి మీది నగలన్నీ తీసుకుని వడ్డీవ్యాపారి వద్దకు వెళ్ళి, వాటిని తాకట్టుపెట్టుకుని



ఇయ్యగలిగినంత సొమ్ము ఇయ్యమన్నాడు వడ్డీవ్యాపారి వాడికి డబ్బు ఇచ్చాడు.

వడ్డీవ్యాపారి కొడుకు పెద్దవాడికి అబాల్యమిత్రుడు.

''డబ్బు ఇంత అవసరంగా ఎందుకు కావలిసి వచ్చిందిరా?'' అని వాడు పెద్దవాణ్ణి అడిగాడు.

పెద్దవాడు చెప్పటానికిసంశయించాడు. వడ్డీవ్యాపారి కొడుకు, ''నాకూ్కడా చెప్ప రానంత రహస్యమా ఏమిత్రా?'' అన్నాడు.

''మళ్ళీ ఎక్కడా అనకు. మా నాన్న నాకు ఏదో నిధినిక్షేప రహస్యం చెప్పి పోయాడని మా తమ్ముడికి అనుమానం! ఆ కారణంగా వాడు నాతో వేర్లు పడ

టానికి సిద్ధమవుతున్నాడు. వాడికి కావలసిన నిధి నేనే సృష్టించి, మానాన్న కోరిన ప్రకారం ఇద్దరమూ కలిసి ఉండే ఏర్పాటు చేస్తాను,'' అంటూ పెద్దవాడు తన పథకం మిత్రుడికి చెప్పాడు.

పెద్దవాడు తాను తెచ్చిన డబ్బును మూటకట్టి, అర్ధరాత్రివేళ పెరట్లో ఒక చోట గుంట తవ్వి, అందులో మూట పూడ్చిపెట్టాడు.

మర్నాడు వాడు చిన్నవాడితో, ''తమ్ముడూ, నన్ను క్షమిస్తే, ఒక విషయం నీకు చెప్పాలి. పోయేముందు నాన్న తాను పెరట్లో దాచిఉంచిన నిధి గురించి చెప్పి, దాన్ని మనిద్దరినీ తీసుకోమన్నాడు. నేను దురాశకుపోయి, ఆ సంగతి నీకు చెప్ప లేదు. నాన్న రాత్రి నాకు కలలో కనబడి, నన్ను నానామాటలూ అన్నాడు; నేను చేసిన తప్పుకు శిక్షగా, ఆ మొత్తం నువే తీసేసుకోవాలనీ, మనంకలిసి ఉండక పోతే తన ఆత్మకు శాంతిలేదనీ అన్నాడు,'' అని చెప్పాడు.

వెంటనే చిన్నవాడు, "చాలా తమాషాగా ఉన్నదే! నాన్న నాకుకూడా రాత్రి కలలో కనబడి, 'ఒరే, మీ అన్న దురాశాపరుడని అపార్థం చేసుకున్నావు! నీ మనసులో తన మీద ఉన్న దురభిప్రాయాన్ని పోగొట్టడానికీ, ఉమ్మడి సంసారం నిల బెట్టడానికీ, వాడు తన భార్య నగలు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చి, దాన్ని పెరట్లో పాతిపెట్టి, నీకు అర్పించాలనుకున్నాడు! ఇప్పటికైనా కళ్ళుతెరిచి, నీ మనసు మార్చుకుని, వాడికి క్షమాపణ చెప్పుకో!' అన్నాడు,'' అని చెప్పాడు.

పెద్దవాడు వాడి మాటలు విని, తన రహస్యం వాడికి తెలిసిపోయి నందుకు నివ్వెరపోయాడు.

వాడి ఆశ్చర్యం చూసి చిన్నవాడు నవ్వు ఆపుకోలేక, ''ఎందుకు ఆశ్చర్యం? నిన్న సాయంకాలం వడ్డీవ్యాపారి కొడుకు నాతో అంతా చెప్పేశాడు, చచ్చేట్టు చివాట్లు పెట్టాడు కూడా! నాకు బుద్ధి వచ్చింది. మనం ఎన్నటికి విడిపోం!'' అన్నాడు.



# అసలు కారణం

పూర్వం అనంతుడు అనే జమీందారు, తనను ఎవరు ఎలా పొగడినా నిజమే అనుకునేవాడు. ఒక రోజున అయన తన అంతరంగికులతో కలిసి, తన పెద్ద పల్లకిలో వనభోజనానికి వెళ్ళాడు. మిట్ట మధ్యాన్నానికి అందరి భోజనాలూ ముగిశాయి.

అనంతుడు తన అంతరంగికులతో, "విన్నారా? దూరంగా ఉన్న ఆ సముద్రఘోషలో మందహాసం వినిపిస్తున్నది! ఇక్కడ మర్రిచెట్టు వీచేగాలిలో సంగీతం వినిపిస్తున్నది!" అన్నాడు.

"తమరు గొప్ప భావుకులు గదా!" అన్నాడు ఒకడు భట్రాజులా.

మిగిలిన వాళ్ళంతా, "నిజం! నిజం!" అంటూ చప్పట్లుకొట్టారు.

వారిలో ఒకడు పల్లకీబోయీల కేసి తిరిగి, "ఏంరా, మీకు సముద్రఘోషలో నవ్వులూ, మర్రిచెట్టు గాలిలో సంగీతమూ వినిపించటం లేదా?" అని అడిగాడు, జమీందారుగారి మెప్పుకోసం.

"ఏమో, బాబూ! ఆకలితో చెవులు గడియలుపడి, మా కడుపులో గుర్రే మాకు వినిపించటం లేదు!" అన్నాడు ఒకబోయీ నీరసంగా.

వెంటనే జమీందారు వాళ్లుకూడా తినాలన్నది గుర్తుతెచ్చుకుని, తన భావుకత కట్టిపెట్టి, వాళ్ళకు భోజనాలు పెట్టించాడు.

—ఎమ్. డి. సౌజన్య





# ఆరాటం పెళ్ళికొడుకు

సూరమ్మకు సింహాద్రి ఒక్కడే కొడుకు. వాడు కొంచెం అమాయకుడు. తండ్రి లేని సింహాద్రికి డబ్బు ఉన్నది గాని, చదువు అబ్బలేదు. వాడికి తమ పిల్లలను కట్టబెట్టటానికి ప్రయత్నించి విఫలులైన బంధువులు, సింహాద్రి వెర్రిబాగులవాడని ప్రచారం చేశారు.

తన వయసు స్నేహితులకు పెళ్ళిళ్ళు జరిగిపోతూంటే తన కింకా పెళ్ళి చెయ్యలేదని సింహాద్రి తల్లిని వేధించుకు తింటూరాసాగాడు. అందుకోసం ఆమె ప్రయత్నాలు చేస్తూనే ఉన్నది గాని, కాలం కలిసిరాలేదు. సింహాద్రి వెర్రిబాగులవాడని బంధువులు చేసిన దుష్ప్రచారం ఊరికే పోలేదు. దానికి తగ్గట్టుగానే వాడు అమాయికమైన ప్రశ్నలువేసి, వెర్రిబాగులవాడేనేమోనన్న అనుమానం రేకెత్తించే వాడు.

పేరాపురంలో నారయ్య కూతురు నాగలక్ష్మిని పెళ్ళిచూపులు చూడటానికి సూరమ్మ సింహాద్రిని తీసుకుని బయలుదేరుతూ, వాడు అక్కడ ఎలా మసులుకోవాలో ఒకటికి, రెండుసార్లు చిలక్కు చెప్పినట్టు చెప్పింది.

పేరాపురం చేరగానే, వాళ్ళకోసం దారిలో ఎదురు చూస్తున్న నారయ్య, వీళ్ళను తీసుకుని తన ఇంటికి బయలుదేరాడు. అతను దారిలో ఒక్కచోట వీళ్లను ఆపి, ఒక ఇంట్లోకి వెళ్ళాడు.

ఇంతలో ఒక అమ్మాయి ఆ ఇంటి లోపలినుంచి వచ్చి, గుమ్మంలో నిలబడింది. చక్కని చుక్కలా ఉన్న ఆ పిల్లను చూసి, సింహాద్రి గబగబా ముందుకు వెళ్ళి, "నువ్వేనా నాగలక్ష్మివి?" అని అడిగాడు. ఆ పిల్ల జవాబు చెప్పకుండా లోపలికి వెళ్ళింది.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



తన పక్కన ఉండిన సింహాద్రి నారయ్య వెళ్లిన ఇంటిగుమ్మం దగ్గిర ఉడటం చూసి సూరమ్మ, "ఏమిట్రా అక్కడ ఉన్నావు?" అని అడిగింది.

సింహాద్రి జరిగినది చెప్పాడు. "తప్పు! అలా అడుగుతారా?" అన్నదామె.

ఇంతలో నారయ్య వచ్చి వీళ్ళను తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఇద్దరూ భోజనాలు ముగించాక సింహాద్రి కొంత దూరంలో ఒక అమ్మాయిని చూసి, "ఆమేనా నాగలక్ష్మి?" అని నారయ్య కొడుకు బాలయ్యను అడిగాడు.

బాలయ్య నవ్వి, పూరుకున్నాడు.

ఆ వెంటనే పెళ్ళిచూపుల తతంగం ప్రారంభమయింది. నారయ్యా, బాలయ్యా, సింహాద్రీ ఒక చోట కూర్చున్నారు. ఎవరో అమ్మాయి వచ్చి, వీరికి కొంచెం దూరంలో నిలబడింది.

"ఆమేనా నాగలక్ష్మి?" అని సింహాద్రి నారయ్యను అడిగాడు.

జవాబుగా నారయ్య చిరునవ్వు నవ్వాడు. మరికొంత సేపటికి, జడనిండా పువ్వులు అలంకరించుకుని, కొత్త బట్టలు కట్టుకుని ఉన్న లావుపాటి యువతిని తీసుకువచ్చి, ఎదురుగా చాపమీద కూర్చోబెట్టారు. అమెను తెచ్చిన మరొక ఆవిడ పక్కన కూర్చున్నది.

"అదేమిటండీ, పెళ్ళికూతురికి మానేసి ఆమె తల్లికి ముస్తాబు చేశారు?" అని సింహాద్రి నారయ్యను అడిగాడు.

"సింహాద్రీ, ఆ పక్కన కూర్చున్న ఆవిడ పెళ్ళికూతురు కాదయ్యా! పెళ్ళికూతురు తల్లి! నా భార్య!" అన్నాడు నారయ్య.

సింహాద్రి లావుపాటి పిల్లను చూసి, "ఆవిడ ఎవరు?" అని నెమ్మదిగా నారయ్యను అడిగాడు.

"పెళ్లికూతురు!" అన్నాడు నారయ్య.

"ఈ మొద్దా? నాకొద్దు!" అని, అప్పుడే లోపలి నుండి వస్తూవున్న తన తల్లి సూరమ్మతో, "అమ్మా, నాకి పెళ్ళివద్దు!

ఈ మొద్దును చేసుకోను!'' అన్నాడు సింహాద్రి.

నారయ్య నవ్వుతూ. ''సింహాద్రీ! నువు నాకు తగిన అల్లుడివయ్యా!'' అన్నాడు.

''అల్లుడూలేదు, గిల్లుడూలేదు! దగా! ఈ బాగులేని పిల్లను నేను చేసుకోను, నారయ్యగారూ!'' అని సింహాద్రి ఖచ్చితంగా చెప్పేశాడు.

నారయ్య మరింత గట్టిగా నవ్వి, ''భయపడకయ్యా! ఆ ముస్తాబైనది పెళ్ళికూతురు కాదు! జరిగిన దేమంటే, మీరు ఇక్కడికి వస్తున్నట్టు తెలిసి, ఎవరో గిట్టనివాళ్లు కాబోలు మీ ఊరు నుంచి వచ్చి, నీ మీద లేనిపోనివి చెప్పారు. అది నిజమో, అబద్ధమో తెలుసుకోవాలని దారిలో నిన్ను మాటల్లో దింపాను. నీ ప్రసంగంలో గాని, నడకలోగాని నాకేమీ లోపం కనిపించలేదు. దారిలో ఒక ఇంట్లోకి నేను వెళ్లానే, ఆ ఇంటి గుమ్మంలో నువు చూసిన పిల్ల మా అమ్మాయే, నాగలక్ష్మి. వాళ్ళ ఇంటికి వెళ్లిందిట. పెళ్ళికూతుర్ని ఎప్పుడు చూద్దామా అన్న నీ ఆరాటం చూసి, తమాషా చేద్దామనీ, నీ గురించి ఇంకా బాగా తెలుసుకోవాలనీ ఈ నాటకం ఆడాం,'' అన్నాడు.

''అల్లుడితో ఆటలేమిటండీ?'' అని సింహాద్రి చిరుకోపం ప్రదర్శించాడు.

సూరమ్మ నవ్వుతూ. ''ఇప్పుడైనా అబ్బాయిని గురించి తెలిసిందా, అన్నగారూ?'' అన్నది.

''వాడికేమమ్మా? నిక్షేపంలా ఉన్నాడు. అందుకే, పిల్లను ఇచ్చేటప్పుడు గాని, పుచ్చుకునేటప్పుడుగాని, చెప్పుడు మాటలకు విలువ ఇయ్యకుండా, స్వయంగా చూసుకోవటం మంచిది అంటారు పెద్దలు.'' అన్నాడు నారయ్య.

ఇంతలో నాగలక్ష్మినే ముస్తాబుచేసి, అక్కడికి తెచ్చారు. పిల్లను చూసి సూరమ్మ తృప్తిపడింది. సింహాద్రి ఆనందానికి అంతేలేదు. తన అల్లుడు అందరూ అన్నంత అమాయకుడూ, తెలివితక్కువ వాడూ కాదని నారయ్య తృప్తిపడ్డాడు.







# రాక్షసి గురువు

ఆనందుకు ఎవరూలేరు. వాడు రెడ్డిగారి ఇంట అన్నిపనులూ చేసేవాడు. వాడికి పదాలు పాడటమంటే చాలా ఇష్టం. పాడుకుంటూనే పనులన్నీ చేసేవాడు. రాత్రివేళ పశువుల కొట్టంలో గడ్డి పరుచుకుని పడుకున్నాక కూడా, అర్ధరాత్రిదాకా పాడుకుని మరీ నిద్రపోయేవాడు.

అయితే వాడి గొంతు చీలిన బొంగులాగా, కర్ణకఠోరంగా ఉండేది. వాడి పాట రెడ్డికీ, ఆయన భార్యకూ ఎంతో బాధాకరంగా ఉండేది. అయినా వాడు ఒళ్ళు దాచుకోకుండా పని చేసేవాడు గనక వాళ్ళు ఎలాగో వాడి పాటను భరించేవారు.

తన పాటను అందరూ చీదరించుకుంటారని ఆనందుకు తెలుసు. "అర్ధరాత్రిదాకా ఓండ్రపెట్టి మా ప్రాణాలు తోడేస్తున్నావురా!" అని రెడ్డి ఎన్నోసార్లు వాడితో అన్నాడు. తన పాటను ఎవరు తిట్టినా వాడి ప్రాణం చివుక్కుమనేది.

ఇలా ఉండగా రెడ్డికి ఒక కొడుకు కలిగాడు. ఆ చంటివాడు ఆనందు పాట వినపడగానే ఉలిక్కిపడి, కెవ్వున అరిచి గుక్కపట్టేవాడు!

ఇలా అనేకసార్లు జరిగిన మీదట రెడ్డి భార్య ఆనందుతో, "నువు పాడటం మానకపోతే మా ఇంట్లో పనిమానెయ్యి." అని నిష్కర్షగా చెప్పేసింది.

అక్కడే ఉన్న రెడ్డి, "వాడు పాటలు ఎలాగూ మానడు. డబ్బులిచ్చి పంపెయ్యి." అంటూ రొండి నుంచి డబ్బు తీసి భార్యకు ఇచ్చాడు.

పని పోయిన దానికన్న, పాడటం మానమన్నందుకు ఆనందుకు ఎక్కువగా అభిమానం పొడుచుకు వచ్చింది. వాడు వెంటనే రెడ్డి ఇల్లు వదిలిపెట్టి, అడవి

మాచిరాజు కామేశ్వరరావు



దారిపట్టాడు. చెట్లూ, చేమలూ, రాళ్ళూ, రప్పలూ, పక్షులూ, జంతువులూ సంగీతానికి తలలు ఊపుతాయనీ, కరుగుతాయనీ వాడు విని ఉన్నాడు.

అడవిలోనే చీకటిపడింది. ఆకాశంలో నిండు చంద్రుడు! గాలినిండా పూల వాసన! ఆనందు ప్రాణానికి వాతావరణం ఎంతో హాయిగా ఉన్నది. వాడు ఒక బండరాయి మీద నడుమువాల్చి, చెట్ల సందుల నుంచి కనిపించే నక్షత్రాలను చూస్తూ ఉత్సాహంగా పాడసాగాడు.

వాడు నిద్రపోయేదాకా అలా పాడటం సమీపంలో ఉంటున్న ఒక రాక్షసి విన్నది. ఆ రాక్షసికి పెళ్లి కావలసిన కూతురు ఉన్నది. ఆ పిల్లరాక్షసి బొత్తిగా అనాకారి కావటాన దాన్ని ఎవరూ పెళ్ళాడటం లేదు. దాని తల్లికి ఇప్పుడు ఒక ఆలోచన వచ్చింది. ఈ పాడేవాడెవడో మహాశ్రవణానందంగా పాడుతున్నాడు. తన కూతురికి పాట నేర్పిస్తే, పాటకోసం దాన్ని పెళ్లాడే వాళ్లు ఉండవచ్చు. నాట్యం నేర్చుకోవటానికి పిల్లది మరీ స్థూలకాయమై పోయింది మరి!

రాక్షసి ఆనందును నిద్రపోతున్నట్టుగానే తీసుకుపోయి, తన గుహలో కూతురి ముందు పెట్టింది.

"మనిషి మాంసం నాకు అరగదు! వీణ్ణి ఎందుకు తెచ్చావు?" అన్నది గారాలకూతురు రాక్షసితో.

"తినటానికి కాదే, వెర్రి మొహమా! వీడు గొప్ప సంగీత విద్వాంసుడు. నీకు పాటలు నేర్పిస్తాడు. నీ పాటలు విని నిన్ను చేసుకుంటామని ఎగబడి వస్తారు!" అన్నది తల్లి రాక్షసి.

"ఆహా పెళ్లి! ఓహో పెళ్ళి!" అంటూ సంతోషంతో పిల్లరాక్షసి చిందులువేసింది.

ఈ కోలాహలానికి నిద్రలేచిన ఆనందుడు తల్లి రాక్షసినీ, పిల్లరాక్షసినీ చూసి కెవ్వుమన్నాడు.

తల్లి రాక్షసి వాడితో, "భయపడకు! అడవిలో అద్భుతమైన నీ పాట విన్నాను.

నీలాటి పాటగాడు మరొకడు ఉండడు. మా అమ్మాయికి ఆ పాటలు నేర్పి పుణ్యం కట్టుకో! నీ కష్టం ఉంచుకోనులే. సంచీడు బంగారం ఇస్తాను,'' అన్నది.

ఇంత కాలానికి తన పాటను మెచ్చుకునే వాళ్లు అంటూ కనబడేసరికి ఆనందుకు పారవశ్యం వచ్చేసింది.

''మనుషులు పశువులకన్న హీనం! వాళ్ళకన్న మీ రాక్షసులకే కళలంటే గౌరవం ఎక్కువ!'' అని వాడు రాక్షసిని మెచ్చుకున్నాడు.



''నువు నీ యిష్టం వచ్చినంత కాలం మాతోటే ఉండి, మా అమ్మాయికి పాటలు నేర్పు. నీకు ఏలోటూ రాకుండా నేను చూస్తాను,'' అన్నది రాక్షసి.

ఆనందు అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు. తెల్లవార వస్తూండటం చూసి రాక్షసి తల్లీ, దాని కూతురూ నిద్రకు ఉపక్రమించారు. ఆనందు అడివి అంతా తిరుగుతూ దొరికిన పళ్లుతిని, చీకటిపడిన దాకా గడిపి, గుహకు తిరిగి వచ్చాడు. అప్పుడే రాక్షసి తల్లీ, కూతురూ నిద్ర లేచారు. తన కూతుర్ని పాటలు నేర్చుకోమని చెప్పి. తల్లి రాక్షసి అరణ్యంలోకి సంచారం వెళ్ళింది.

పిల్లరాక్షసి భక్తిగా ఆనందు కాళ్ళు కళ్ళకు అద్దుకుని, చర్మాలమీద పాఠం నేర్చుకోవటానికి కూర్చున్నది. ఆనందు దానికి ఒక పల్లవి చెప్పి, అలా పాడమన్నాడు. అది పాడింది. కాని అది వాడికి పాటలా వినిపించలేదు; కొండ మీది నుంచి బండరాళ్లు దొర్లినట్లూ, ఉరుములు ఉరిమినట్లూ తోచి, వాడికి చాలా బాధ కలిగింది.

''ఆపు! అంతలా గొంతు చించుకోకు! కాస్త చిన్నగా, సన్నగా పాడు!'' అంటూ ఆనందు దానికి మళ్లీ పాడి వినిపించాడు.

పిల్లరాక్షసి మరింత భీకరంగా పాడింది. అది పాడుతూంటే ఆనందుకు కడుపులో కెలికినట్టయింది. అయినా వాడు దానికి పాట పూర్తిగా నేర్పి, తాను కునుకుతీయ

యత్నించాడు. కాని అది పాటసాధన చేస్తూంటే వాడికి కన్ను మూతపడలేదు.

ఇంతలో తల్లి రాక్షసి రెండు దుప్పులను చంపి తెచ్చి, ''నా తల్లే పాడుతున్నది! ఇంకా ఏ కోయిలో గుహలోకి దూరిందనుకుంటున్నా!'' అంటూ కూతురిని కావిలించుకుని, ముద్దు పెట్టుకున్నది.

అది మొదలు ఆ గుహ ఆనందుకు నరకం అయింది. రాక్షసి పాటమూలంగా వాడికి నిద్రలేదు. దాని గొంతు వినిపిస్తేనే వాడికి తేళ్ళూ, జెర్రులూ పాకినట్టుండేది.

ఒకసారి వాడు తెగించి తల్లి రాక్షసితో, ''మీ అమ్మాయి గొంతు బాగుండదు. దానికి సంగీతం నప్పదు,'' అని చూశాడు.

తల్లి రాక్షసి మండిపడి, ''ఒళ్ళు దగ్గిర పెట్టుకుని మాట్లాడు, గురూ! అది నిన్ను మించిపోతుందని నీ అసూయ!'' అన్నది.

ఆనందు మరి మాట్లాడ లేదు.

కళ కేవలం ఆత్మసంతృప్తికి మాత్రమే కాదు. అది ఇతరులను కూడా రంజింపజేయాలి. అందులో సంగీతం మరీనూ! ఏమంటే ఇతర కళలు మరెవరికీ తెలియకుండా అభ్యసించ వచ్చు. సంగీతం ఇతరులకు వినిపిస్తుంది. స్వరంఘోరంగా ఉంటే ఇతరులు ఎలా బాధపడతారో ఆనందు ఇప్పుడు తెలుసుకున్నాడు.

రాక్షసి ఇస్తానన్న బంగారం కోసం కూడా చూడక, ఆ రోజు పగలు రాక్షసి తల్లీ కూతుళ్ళు నిద్రపోతూండగా వాడు గుహను వదిలేసి, రెడ్డి ఇంటికి చేరుకున్నాడు.

''మళ్ళీ వచ్చావుట్రా?'' అని రెడ్డీ, అతని భార్యా వాణ్ణి అడిగారు.

ఆనందు వాళ్ళకు జరిగినది చెప్పి, ''నాకు బుద్ధి వచ్చింది. నా తప్పు తెలుసుకున్నాను. నేను వచ్చింది పని చెయ్యటానికి, పదాలు పాడటానికి కాదు!'' అన్నాడు.

ఆ తరవాత వాడు పదాలు పాడలేదు. కాని వాడికి రాక్షసి గురువు అనే కొత్త బిరుదు మాత్రం వచ్చింది.





# దేవీ భాగవతం

శర్యాతి అనే రాజుకు భార్యలు వేల సంఖ్యలో ఉండేవారట. అందరు తల్లులకూ సుకన్య ఒక్కతే కూతురు కావటం చేత అమిత గారాబంగా పెరిగింది.

రాచనగరు వెలపల ఒక అందమైన తటాకం సమీపంలో చ్యవనుడు అనే భృగువంశం వాడు అంబను గురించి తపస్సు చేస్తున్నాడు. అతని చుట్టూ పుట్టలు లేచాయి, లతలు చుట్టుకున్నాయి.

ఆ చెరువు ఉన్న ప్రాంతానికి శర్యాతి స్త్రీలతో సహా విహారానికి వచ్చాడు. వాళ్ళ వెంట వచ్చిన సుకన్య సీతాకోకచిలుకలాగా పూలకోసం అటూ ఇటూ పరిగెత్తికోస్తూ, తన చెలికత్తెలతో కలిసి తిరుగుతున్నది. ఇంతలో ఆమెకు చ్యవనుడున్న పుట్ట కనబడింది. సుకన్య కుర్రతనం కొద్దీ అందులోకి తొంగి చూసేసరికి రెండు వస్తువులు ఏవో ప్రకాశిస్తూ కనిపించాయి. వెంటనే ఆమె ముళ్ళతో వాటిని పొడవబోయింది.

అది చూసి చ్యవనుడు, "అమ్మాయీ, ఈ పుట్ట జోలికి రాకు, దూరంగా వెళ్ళు. నేను తపస్సు చేసుకుంటున్నాను," అన్నాడు.

సుకన్య ఆ మాటలు వినక, ముళ్ళతో చ్యవనుడి కళ్లు పొడిచి, అతన్ని అంధుణ్ణి చేసింది. సుకన్య తాను చేసిన పనికి క్షణంపాటు పశ్చాత్తాపపడినా, వెంటనే ఆ మాట మరచిపోయి క్రీడోత్సాహంలో పడిపోయింది.

23. చ్యవనుడి కథ



చ్యవనుడు మాత్రం బాధ సహించలేక రోదన ప్రారంభించాడు. అదే సమయంలో రాజుకూ, అతని పరివారానికీ మలమూత్రాలు స్తంభించిపోయాయి. అందరికీ ఒకేసారి శాపం తగిలినట్టుగా ఇలా కావటానికి ఆశ్చర్యపడుతూ, శర్యాతి తన నగరానికి తిరిగి వెళ్ళి, తన సైనికులతో, ''మన పురానికి సమీపంలోనే చ్యవనుడనే వృద్ధుడు తపస్సు చేసుకుంటున్నాడు. ఎవరుగాని ఆయనకు బాధ కలిగించలేదు కద? ఈ పని ఎవరు చేసినదీ మీరు తెలుసుకోండి,'' అన్నాడు.

సైనికులు మాకు తెలియదంటే, మాకు తెలియదన్నారు. రాజు వాళ్ళ మాటలు నమ్మక, నిజం చెప్పమని హింసించనారంభించాడు.

ఈ సంగతి సుకన్య విని, ''నాన్నా, నేను వనవిహారం చేస్తుండగా ఒక పుట్ట కనబడింది. అందులో రెండు రంధ్రాలున్నాయి. వాటికుండా రెండు కాంతులు వెలువడటం చూసి, పొడిచేసరికి వాటి నుంచి నీరు కారనారంభించింది. అదే సమయంలో ఏదో ఆర్తనాదం హీనంగా వినిపించింది. అలా వినిపించినందుకు ఆశ్చర్యపడుతూ అక్కడి నుంచి వచ్చేశాను. నేను దేన్ని పొడిచానో నాకు తెలీదు,'' అన్నది.

మహామునికి జరిగిన అపచారం ఇదే అయి ఉంటుందనుకుని, రాజు వెంటనే బయలుదేరి చ్యవనుడున్న చోటికి పోయి, పుట్టను తొలగించి, కళ్ళు పోయి బాధతో కుమిలిపోతున్న మునికి సాష్టాంగపడి, ''మహాత్మా, తెలియక నా కూతురు నీకు చేసిన హానికి ఆగ్రహించవద్దు. మీ వంటి తాపసులకు ఆగ్రహం తగదు,'' అని వేడుకున్నాడు.

దానికి చ్యవనుడు, ''రాజా, నా మనస్సులో కోపం ఏ కోశానా లేదు. నీ కూతురు నా కళ్ళు పొడిచిన కారణంగా నీకు అలా బాధ కలిగింది. అంతేగాని నేను శపించలేదు. ఎవరికీ ఎలాటి హానీ కలిగించ



కుండా తపస్సు చేసుకునేవారికి హాని చేస్తే ఊరికేపోతుందా? ఈశ్వరుడు ఆగ్రహించడా? ముసలివాణ్ణి! ఇప్పుడు గుడ్డివాణ్ణి కూడానూ! ఈ దిక్కులేని నాకు ఇప్పుడు ఎవరు పరిచర్యలు చేస్తారు?'' అంటూ దుఃఖించాడు.

''మహామునీ, నీకు ఎందరు సేవకులు కావాలన్నా పంపుతాను. వాళ్ళు నీకు కావలసిన విధంగా సేవలు చేస్తారు. మనస్సులో కోపం మాత్రం పెట్టుకోవద్దు.'' అని రాజు అన్నాడు.

దానికి ముని, ''అయ్యో, గుడ్డివాణ్ణి కదా, నాకు నిష్ఠ ఎలా సాగుతుంది? నీ సేవకులు నాకేం చేయగలరు? నాకు సేవ చెయ్యటానికి నీ కూతురిని నాకు పెళ్ళిచెయ్యి. నేను మునిని గనక సంకోచించ నవసరంలేదు,'' అన్నాడు.

ఈ మాట విని శర్యాతి విచారగ్రస్తుడై, దీర్ఘాలోచనలో పడి, ఎటూ చెప్పలేక పోయాడు. ముసలివాడూ, గుడ్డివాడూ, మొరటువాడూ అయిన చ్యవనుడు అతి నాజూకుగా పెరిగిన సుకన్యను ఏం సుఖ పెట్టుతాడు? సుకన్య ఇలాటి భర్తతో ఎలా కాపరం చేస్తుంది?

ఇలా అనుకుని శర్యాతి చ్యవనుడికి తన కూతురిని భార్యగా ఇయ్యటం ఇష్టం లేక, ఇంటికి తిరిగివెళ్ళి, తన మంత్రులతో, ''చూశారా, పరిస్థితి ఎలా వచ్చిందో? నేను నా కూతురిని ఆ మునికి ఇయ్యాలి, లేదా మలమూత్ర స్తంభనతో మనం బాధ పడాలి!'' అన్నాడు.

దానికి మంత్రులు, ''మహారాజా, సుకన్యను మునికి ఇయ్యటం మాకు కూడా సమ్మతం కాదు,'' అన్నారు.

అంతలో సుకన్య అక్కడికి వచ్చి, విషయం తెలుసుకుని, ''నా కోసం మీరంతా ఇంత బాధపడటం దేనికి? నేను చేసిన తప్పు వల్ల కదా ఆ ముని కళ్ళు పోయాయి? ఆయన దయ సంపాదించుతాను. మీరంతా సుఖంగా ఉండండి!'' అన్నది.



దానికి రాజు, ''అయ్యో! ఆ గుడ్డి, ముసలి చ్యవనుడికి అడవిలో నువు పరిచర్యలు ఎలా చేస్తావు? నా సుఖం కోసం నిన్ను మునికి ఇయ్యనా? నీ చేత ఈ అడివిలో ముసలి మొగుడితో కాపరం చేయిస్తే నాకు పుట్టగతులుంటాయా? అమ్మా, నేనూ, నా రాజ్యమూ ఏమై పోయినాసరే గాని, నా చేతి మీదుగా నిన్ను నేను ఆ కళ్ళులేని ముసలిమునికి ఇయ్యను,'' అన్నాడు.

దానికి సుకన్య, ''నీ మాట సవ్యంగా లేదు. ఈ ముని లోకోత్తరుడు. ఆయన వృద్ధుడైతేనేం? ఆయనను సేవించుకుంటాను. నేను సుఖపడాలని కోరటం లేదు. నా మూలంగా మీ కందరికీ సుఖం కలగటం చాలదా?'' అన్నది.

ఆమె దృఢసంకల్పం చూసి రాజూ, మంత్రులూ ఆశ్చర్యపోయారు. తరవాత శర్యాతి ఆ ముని వద్దకు తిరిగివెళ్ళి, నమస్కరించి, ''నా కుమార్తెను నీ కిచ్చి వివాహం చేస్తాను. అనుగ్రహించి ఆమెను గ్రహించు,'' అన్నాడు.

చ్యవనుడికి, సుకన్యకూ శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. రాజుకూ, సైనికులకూ వ్యాధి నివారణ అయింది. తండ్రి తిరిగి పోయేటప్పుడు సుకన్య, తన నగలు ఇచ్చి, తనకు చర్మమూ, నారబట్టలూ ఇయ్యమన్నది.

తరవాత సుకన్య కొత్త జీవితం ఆరంభించింది. ఆమె అడవిలో అన్నిదిక్కులూ తిరిగి ఫలాలూ, దుంపలూ తెచ్చేది; అగ్నుల కోసం ఎండు సమిధలు ఏరేది; నువ్వులూ, దర్భలూ చేర్చి, తోమిన కమండలంతో బాటు ఒకపక్క ఉంచి, భర్తను వేడినీళ్ళతో స్నానం చేయించి, చర్మం పరచి, తన భర్తను నిత్యకర్మకు సిద్ధంచేసేది; నిత్యకర్మ అయిన తరవాత ఆయనను చేయిపట్టి తెచ్చి కూర్చోబెట్టి, భోజనం పెట్టేది; భోజనానంతరం ఆయన చేతులూ, కాళ్ళూ కడిగేది; తరవాత తాను భోజనం చేసి,



భర్తకు కాళ్ళు పట్టేది. భర్త ఎక్కడికి వెళ్ళాలన్నా సుకన్య చెయ్యి పట్టుకుని నడిపించుకు పోయేది. ఇలా ఆమె తన భర్తను భక్తితో సేవిస్తూ, కాలం గడుపుతున్నది.

ఒకనాడు ఆమె చెరువులో స్నానం చేసి వస్తుండగా అశ్వినులు ఆమెను చూసి, ఆమె సౌందర్యానికి ఆశ్చర్యపడి, ఆమెను సమీపించి, ''అమ్మాయీ, కొంచెం ఆగు! మేం అశ్వినులం. నువు ఎక్కడి నుంచి వస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు? నీ భర్త ఎవరు? తండ్రి ఎవరు? నువు రాజకుమార్తెవా? లేక అప్సరవా? ఇదంతా ఉత్త పొగడ్తకాదు,'' అన్నారు.

వారి మాటలకు సుకన్య కొంచెం సిగ్గుపడి, ''నేను శర్యాతికూతుర్ని. గౌరవనీయుడైన చ్యవనుడి భార్యను. ఆయన వృద్ధుడూ, అంధుడూనూ. ఆయనకు సేవచేస్తూ ఉంటాను. నా కోరిక మీదనే నా తండ్రి నన్ను ఆయనకు ఇచ్చి పెళ్ళి చేశాడు. ఆ కనిపించేదే ఆయన ఆశ్రమం. మీ రెవరో మంచివాళ్ళలాగున్నారు. అక్కడికి దయచెయ్యండి,'' అన్నది.

ఈ మాట విని అశ్వినులు, ''గుడ్డివాడైన ముసలికి నీ తండ్రి నిన్ను ఏమని ఇచ్చాడు? నీ వంటి అందగత్తెలు దేవతా స్త్రీలలో కూడా లేరు. గుడ్డికి భార్యగా ఎలా ఉండగలుగుతున్నావు? నీకు ఈడైనవాణ్ణి చూసి వరించరాదా? అలాచేసి జీవితమంతా సౌఖ్యం అనుభవించు,'' అన్నారు.

దానికి సుకన్య, ''మీరు సూర్యుడి కొడుకులు. మీకు తెలియనిదేమీ లేదు. అన్యకాంతనైన నాతో మీరు ఇలా మాట్లాడవచ్చునా? నేను కులకన్యను. మీరు అధిక ప్రసంగం చేస్తే మిమ్మల్ని శపించే శక్తి నాకున్నది!'' అన్నది.

ఆ మాటకు అశ్వినులు భయపడి, ఆమెను మంచి చేసుకునే ఉద్దేశంతో, ''అమ్మా, శీలం విషయంలో నువు లీలావతి కన్నా గొప్పదానివి. వరం కోరుకో, ఇస్తాం!'' అన్నారు.

వాళ్ళు ఆమెకు ఒక అవకాశం ఇచ్చారు. అదేమంటే, చ్యవనుణ్ణి తమతో సమానమైన వయసూ, అందమూగల వాణ్ణిగా చేసేటట్టూ, అప్పుడు ఒకే రూపులో ఉన్న ముగ్గురిలో సుకన్య ఒకరిని భర్తగా వరించేటట్టూనూ!

సుకన్య తమ ఆశ్రమానికి వెళ్ళి, చ్యవనుడితో అశ్వినులు అన్నమాట చెప్పి, ఏం చెయ్యను అని అడిగింది.

అశ్వినులు కోరినట్టే చెయ్యమన్నాడు చ్యవనుడు. సుకన్య వెళ్ళి, వాళ్ళను తమ ఆశ్రమానికి తెచ్చింది.



చ్యవనుడు యువకుడు కావాలంటే నీటిలో మునగాలి. చ్యవనుడు సరే నన్నాడు. ముగ్గురూ చెరువులో మునిగి ఒకే రూపులో బయటికి వచ్చారు. వారిలో కావలసినవాణ్ణి సుకన్య ఎన్నుకోవాలి.

సుకన్య తనకు జగదంబే శరణ్య మనుకుని, ఆమెను ధ్యానించింది. అంబ అనుగ్రహించి ఆమెకు దివ్యజ్ఞానం ఇచ్చింది. సుకన్యకు ఆ ముగ్గురిలో తన భర్త ఎవరో తెలిసిపోయింది. ఆమె తన భర్తనే ఎన్నుకోవటం చూసి, అశ్వినులు ఆమె శీలాన్ని మెచ్చుకున్నారు.

చ్యవనుడు అశ్వినులను ప్రశంసిం చుతూ, "మీ ధర్మాన నాకు యౌవనమూ, కళ్ళూ కూడా ప్రాప్తించాయి. అందగాణ్ణి అయాను. ఉపకారానికి ప్రత్యుపకారం చేయాలి. కనక చెప్పండి, నా నుంచి మీరు ఏం కోరుతారు?" అన్నాడు.

దానికి అశ్వినులు ఇలా అన్నారు:

"మేం వైద్యం చేసేవాళ్ళమన్న నెపంతో యజ్ఞాలలో మాకు సోమపానం చేసే హక్కు లేకుండా చేశారు. నీకు ఇష్టమైతే మాకు ఆ హక్కు కలగజెయ్యి."

"శర్యాతి చేత యజ్ఞం చేయించి మీకు సోమం ఇప్పిస్తాను." అన్నాడు చ్యవనుడు అశ్వినులతో.

అశ్వినులు తృప్తిపడి వెళ్ళిపోయారు. యౌవనం పొందిన చ్యవనుడు సుకన్యతో తన ఆశ్రమానికి తిరిగివచ్చాడు.

ఒకనాడు శర్యాతి భార్యకు తన కూతురు ముసలి, గుడ్డి మొగుడితో ఎలా వేగుతున్నదో, అని ఆందోళన పట్టుకున్నది. శర్యాతికి కూడా తన కూతురిని చూడాలనిపించింది. ఇద్దరూ రథం మీద చ్యవనాశ్రమానికి వచ్చారు. అక్కడ సుకన్య వెంట ఒక అందమైన యువకుడు వారికి కనిపించాడు. తన కూతురు ముసలిభర్తను చంపి, యౌవనోద్రేకం కొద్దీ ఇంకెవరినో వరించిందని శర్యాతి ఆందోళన చెందాడు.

కాని సుకన్య తన తండ్రి ఆందోళనను పోగొట్టుతూ, జరిగిన సంగతి అంతా చెప్పింది. చ్యవనుడు తాను అశ్వినులకు ఇచ్చిన మాట గురించి చెప్పాడు.

తన అల్లుడి కోసం శర్యాతి యజ్ఞం తలపెట్టాడు. యజ్ఞం జరుగుతున్నచోటికి దేవతలతో సహా ఇంద్రుడూ, అశ్వినులూ కూడా వచ్చారు.

తరవాత చ్యవనుడు అశ్వినులకు సోమం ఇయ్యబోతే, ఇంద్రుడు వారిస్తూ, "వీళ్ళు వైద్యం చేసుకునేవాళ్ళు. సోమపానానికి అర్హులుకారు!" అన్నాడు.

"వీరికి సోమం ఇప్పించటానికనే ఈ రాజు చేత యజ్ఞం చేయించాను. నేను వీరికి సోమం ఎలా ఇస్తానో చూస్తూ ఉండండి," అన్నాడు చ్యవనుడు, అశ్వినులకు సోమం ఇస్తూ.

ఇంద్రుడికి కోపం వచ్చింది. అతను చ్యవనుణ్ణి చంపటానికి వజ్రాయుధం ప్రయోగించాడు. చ్యవనుడు దాన్ని తన తపశ్శక్తితో ఆపి, కృత్యను సృష్టించి, ఇంద్రుణ్ణి చంపటానికి హోమం చేశాడు. భయంకరాకారంతో కృత్య అగ్నిగుండం నుంచి ఆవిర్భవించాడు. ఆ అవతారం చూసి ఇంద్రుడూ, దేవతలూ వణికిపోయారు.

బృహస్పతి ఇంద్రుడితో, "చ్యవనుడి శరణు వేడు. కృత్యను అతనే నిగ్రహించగలడు," అన్నాడు.

ఇంద్రుడు అలాగే చేసి, ప్రాణాలతో బయటపడ్డాడు.





# పనికిమాలిన మూక

ఒక గ్రామంలో ధనికుడైన ఆసామీ ఒకడుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకులుండేవారు. నలుగురు కూడా యెందుకూ పనికిరాని పరమ మూఢులే. పెరిగి పెద్దవాళ్ళయి పిల్లల్ని కనే వయసు వచ్చినాకూడా వాళ్లు తల్లిచాటు పిల్లల్లాగా, తండ్రిచాటు పిల్లల్లాగా ప్రవర్తించుతూ, ఏ బాధ్యతా లేకుండా బతికారు.

ఇది చూసి తండ్రి వారిపై బాధ్యతలు పడేసి, స్వతంత్రంగా బతకటం నేర్పాలని నిశ్చయించుకున్నాడు. ఆయన పెద్దవాణ్ణి పిలిచి, "నువు మీ మేనమామల ఊరికి పోయి అక్కడ అందరి క్షేమసమాచారాలూ తెలుసుకుని రా!" అన్నాడు.

వాడు మర్నాడు తెల్లవారుజామున బయలుదేరి వెళ్లేటప్పుడు, తల్లి, "నాయనా, ఆ వూరు అసలే నిప్పూ, నీరూ పుట్టని ఊరు. నువు అదేపనిగా అక్కడుండిపోక వెంటనే తిరిగి వచ్చెయ్యి. మీ మామలు నాలుగు రోజులుండమంటే, తొందరపని ఉన్నదని చెప్పు." అన్నది.

పెద్దవాడు ఎవరికీ తెలియకుండా రెండు దుత్తలు సంపాదించి, ఒక దానిలో కొద్దిగా నిప్పూ, రెండో దానిలో నీరూ పోసుకుని మేనమామల ఊరికి బయలుదేరాడు, కొంత దూరం పోయాక రెండు దుత్తలు మోయటం వాడికి ఇబ్బంది అనిపించి, నిప్పున్న దుత్తలోనే నీళ్ళు పోసేసి ఖాళీ దుత్త అవతల పారేసి ప్రయాణం సాగించాడు. త్వరలోనే మేనమామలు వుండే ఊరు చేరుకున్నాడు.

వాణ్ణి చూడగానే మేనమామలు, "ఆ దుత్త ఏమిట్రా?" అని అడిగారు.

"మీ ఊళ్ళో నిప్పూ, నీరూ పుట్ట పుటగా? అందుకని వెంట తెచ్చాను," అన్నాడు వాడు.

''ఒరే, నీ తెలివి తెల్లవారా ! నిప్పేదీ?'' అని వాళ్ళు అడిగారు.

''నీళ్ళల్లోనే వుంది,'' అన్నాడు వాడు.

వాడి అమాయికత్వానికి మేనమామలు నవ్వుకుని, వాణ్ణి తిప్పి పంపేటప్పుడు, ''చూడు, నాయనా! ప్రపంచం పాపిష్టిది. నువ్వెప్పుడూ ఒంటరిగా ఇల్లు కదలవద్దు!" అని సలహా ఇచ్చారు.

వాడింటికి తిరిగి వచ్చి జరిగినదంతా తండ్రికి చెప్పాడు. తండ్రి వాడి మీద ఆశలు మానుకుని రెండో కొడుకును దగ్గరకు పిలిచి, ''ఒరే నాయనా! నువు వెళ్ళి మన పాలెంలో కాపరం పెట్టి ఈ యేడు నుంచీ స్వయంగా దగ్గిర ఉండి వ్యవసాయం చూడరా!'' అన్నాడు.

''సరే, నాన్నా!'' అని రెండోవాడు పాలెంలో కాపరం పెట్టి వ్యవసాయం పనులు చూడసాగాడు. అక్కడి పొలాలలో నువ్వులు పండిస్తారు. అది నువ్వులు చల్లే తరుణం. అందుచేత రైతులు నువ్వుల బస్తాలు విప్పి సిద్ధంగా ఉంచారు.

ఆసామీ కొడుకు తోచక పచ్చి నువ్వులు గుప్పిళ్ళతో తీసుకుని తినసాగాడు. ఇది చూసి ఒక రైతు అతనితో, ''పచ్చి వెందుకు తింటారు, బాబూ! కావలిస్తే వేపిస్తాను,'' అంటూ తన భార్యచేత ఒక శేరు నువ్వులు వేపించి యజమాని కొడుక్కు పెట్టించాడు. వాడు వాటిని తిని వాటి రుచికి ఆశ్చర్యపోయి, ''ఇదుగో, ముందు ఈ బస్తాలలోని నువ్వులన్నీ



వేపించండి.'' అని రైతులకు ఉత్తరు విచ్చాడు.

''మరి విత్తనాలకో?'' అన్నారు రైతులు నిర్ఘాంతపోయి.

''నే చెబుతాగా!'' అన్నాడు ఆసామీ కొడుకు, అంతా తెలిసినట్టు.

పోనీ అతని ఇష్టప్రకారమే చేద్దామని నువ్వులన్నిటినీ రైతులు మంగలాల్లో పోయించి, వేపించారు.

''ఇక వీటిని తీసుకుపోయి పొలంలో చల్లండి. కమ్మని నువ్వులు కాస్తాయి. ఇంతకాలంగా వ్యవసాయం చేస్తున్నారు. పచ్చి నువ్వులు చల్లి పచ్చి నువ్వులు పండించటం తప్ప మీ కింకేమీ తెలీదు!'' అన్నాడు ఆసామీ రెండో కొడుకు.

రైతులు ఆసామీ దగ్గిరికి పరిగెత్తి జరిగిన దంతా చెప్పారు. ఆసామీ తల బాదుకుని రెండో కొడుకును వెనక్కి పిలిపించాడు.

ఆసామీకి ఉన్న గ్రామంలోనే ఒక మూల పశువుల శాల ఉన్నది. అక్కడ పెత్తనం చెయ్యమని ఆసామీ తన మూడో కొడుకును నియోగించాడు.

వాడక్కడ కొన్ని రోజులున్న తరవాత ఒక గొప్ప ఆలోచన తట్టింది. వెంటనే వాడు పశువుల కాపర్లను అందరినీ పిలిచి ఈ విధంగా చెప్పాడు:

''ఒరే, యింకో నెలకు సంక్రాంతి పండగ వస్తుందిట. మీరు ఈ నెలరోజులూ ఒక్క పశువును కూడా పాలు పిండకండి.





సంక్రాంతినాడు నెలరోజుల పాలూ ఒక్కసారి పిండేసి ఎక్కువ ధరకు అమ్మేద్దాం!''

ఈ మాటలు విని కొంతమంది నౌకర్లు నవ్వారు. మరి కొంతమంది, ''అది కుదిరే పని కాదు లెండి, దొరా!'' అని మర్యాదగా చెప్పి చూశారు.

కాని ఆసామీ కొడుకు మండిపడి, ''నేను చెప్పినట్టు చెయ్యండి. యజమానిని నేనా, మీరా?'' అన్నాడు.

మనకెందుకు లెమ్మని వాళ్ళు పశువులను పాలు పిండటం మానేశారు. సంక్రాంతి వచ్చేసరికి పశువులన్నీ వట్టిపోయాయి. పశుకాపర్లు జరిగినది యజమానికి చెప్పారు. ఆయన తన మూడో కొడుకును ఇంటికి పిలిపించుకున్నాడు.

ఇప్పుడు ఆసామీ ఆశలన్నీ తన ఆఖరు కొడుకు మీద ఉన్నాయి. నిజానికి వాడు మిగిలిన ముగ్గురికంటె తెలివిగలవాడుగా కనపడేవాడు.

మిగిలినవాళ్ళకు చెప్పినట్టుగా ఆఖరు వాడితో తండ్రి ఫలాని పని చెయ్యమని చెప్పక, ''నువ్వేం చేద్దామనుకుంటున్నావురా, అబ్బాయ్?'' అని అడిగాడు.

''నాకు వర్తకం చెయ్యాలని వుంది, నాన్నా!'' అన్నాడు కడగొట్టువాడు.

''అయితే రెండు వేల రూపాయలు తీసుకుని వర్తకం చేసి డబ్బు సంపాదించుకు రా!'' అన్నాడు తండ్రి.

తండ్రి ఇచ్చిన రెండువేలూ పట్టుకుని ఆఖరు కొడుకు బస్తీకి వెళ్ళాడు. అక్కడ రకరకాల సరుకులు బేరంచేసి చివరకు గంధపుచెక్క కొని ఒక బండిమీద వేసుకుని బయలుదేరాడు.

ఆ బండీలో వాడు చాలాదేశం తిరిగాడు గాని సరుకు అమ్మకం కాలేదు. చివరకు ఒక ఊరు చేరి, ''ఈ ఊళ్ళో ఏం బాగా అమ్ముతుంది?'' అని అక్కడి వారిని కొందరిని అడిగాడు.

''అబ్బో! ఇవాళ బొగ్గుకున్న గిరాకీ మరి దేనికీ లేదు!'' అన్నారు వాళు.

''భేష్'' అనుకుని ఆసామీ ఆఖరు కొడుకు, బండిమీది గంధం చెక్క యావత్తూ దింపి, దాన్ని బొగ్గుచేసి, అప్పటి కప్పుడే పది రూపాయలకు అమ్మేశాడు. తరవాత వాడు బండిమీద మరొక ఊరికి వెళ్ళి, అక్కడి వాళ్ళని, ''ఇక్కడ చౌకగా దొరికే సరుకేమిటి?'' అని అడిగాడు.

''ఇంకేముంది? దూది! ఏ ఇంటో అడిగినా దొరుకుతుంది!'' అన్నారు ఊళ్ళోవాళ్లు అతనితో.

ఆసామీ ఆఖరు కొడుకు తన దగ్గిర వున్న పది రూపాయలతోనూ దూది కొని బండిమీద వేసుకుని బస్తీకి చేరి అక్కడ దూది అమ్మకానికి పెట్టాడు.

సరుకు చూసిన వారల్లా, ''కొందుము గాని దూది శుద్ధంగాలేదు, బాబూ!'' అన్నారు. ఆ దూది ఇక ఎక్కడా అమ్ముడు పోదని తెలిసిపోయింది.

ఆసామీ కొడుక్కు యేం చెయ్యాలో పాలుపోలేదు. వాడు బండిని నడిపించుకుని వీధివెంట వస్తూ, కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని అక్కడ కనిపించిన ఒక ఇంటి అరుగుమీద కూచున్నాడు.

ఆ అరుగుమీదే ఒక పక్కగా ఒక కమసాలి కొలిమిలో బంగారం పెట్టి, గొట్టంతో ఊదుతూ కనిపించాడు.

''ఏమిటో చేస్తున్నారే కమసాలిగారు?'' అన్నాడు ఆసామీ ఆఖరు కొడుకు.

''బంగారం నిప్పులో పెట్టి శుద్ధి చేస్తున్నాను, బాబూ!'' అన్నాడు కమసాలి.

ఆసామీ ఆఖరు కొడుక్కు ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. అతను వెంటనే బయలుదేరి, బసకు వెళ్ళి, బండిమీది నుంచి దూదిబస్తాలు దింపించి పెద్ద హోమగుండం తయారు చేయించి, దూదిని శుద్ధి చెయ్యటానికిగాను, బస్తాలన్నిటినీ ఆ గుండంలో పడేయించాడు.

దూది కాస్తా భగ్గున మండి నుసినుసి అయిపోయింది. అంతతో ఆసామీ ఆఖరు కొడుకు వర్తకం కూడా ఆఖరయింది. ఆసామీ తన కొడుకుల మీద పెట్టుకున్న ఆశలు కూడా ఆఖరయాయి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Brahmdev

Brahmdev

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ అగష్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇంత వటుడు !

రెండవ ఫోటో : ఎంత నటుడో !

పంపినవారు : బొడ్డపాటి తిరుమలనాగేశ్వరరావు, మచిలీపట్నం - 2

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.
















ఐఓబిలో మైనర్ ఖాతా ప్రారంభించి- మీనా తండ్రి మంచిపని చేశారు. అప్పుడప్పుడు చిన్న మొత్తాలు అందులో వేసి వుంచారు. ఇప్పుడు మీనాకి 12 ఏళ్ళు రావడంతో తానే తన ఖాతా వాడుకో కల్గుతూంది. ఇలా కూడబెట్టిన-డబ్బుమీద మంచి వడ్డీ కూడా ముట్టింది.

## డబ్బుని చాలాకాలం వుండేలా చేస్తుంది ఐఓబి మైనర్ ఖాతా

IOB /3A/80/ Tel

ఐఓబికి రండి
మా దగ్గిర మీ కోసం
మంచి పధకాలున్నాయి.



**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**
మీ ఔన్నత్యాన్ని కోరే ఉత్తమ మిత్రుడు

# శత్రు సంహారం!































గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.